శ్రీ ర స్తు

# కవిసంశయవిచ్ఛేదము

ఆడిదము సూరకవీంద్రకృతము

శ్రీ తిమ్మావఝ్ఝుల కోదండరామయ్యగారిచేఁ

పరిష్కృతము



చెన్నపురి:

శాస్త్రులు అండ్ సన్స్

ప్రకటితము

1955.

 [Price Rs. 1—4—0

# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రూ. | ఆ. |
|---|---|---|---|
| కళాపూర్ణోదయము | ... | 4 | 0 |
| ,, లఘుటీకానుక్రమణికతో | ... | 5 | 8 |
| ఆంధ్రకుమారసంభవము - ఆడిపూడి సోమనాథరావు | ... | [illegible] | 12 |
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యునిది | ... | 0 | 12 |
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | | 0 | 12 |
| ,, గోత్తి సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 1 | 0 |
| క్రీడాభిరామము | ... | 1 | 8 |
| గరుడాచలము-యక్షగానము, పెద్దన్న | ... | 0 | 6 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము | ... | 0 | 6 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | ... | 1 | 8 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | ... | 1 | 12 |
| చెన్నపురీవిలాసము | ... | 0 | 8 |
| చెన్నబసవపురాణము, అత్తలూరి పాపకవి | ... | 2 | 8 |
| ఛందోదర్పణము (అనంతునిఛందస్సు) | ... | 2 | 0 |
| జైమినీభారతము, పిల్లలమర్రి పినవీరభద్రకవి | ... | 2 | 8 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 4 |
| దశావతారచరిత్ర, ధరణిదేవుల రామయమంత్రి | ... | 4 | 0 |
| దశరాపద్యములు | ... | 0 | 3 |
| ధనాభిరామము, నూతనకవి సూరనకృతము | ... | 0 | 12 |
| ధ్రువోపాఖ్యానము, సటీక (భాగవతములోనిది) | ... | 0 | 12 |
| నరసభూపాలీయము, సటీక (కావ్యాలంకారసంగ్రహము) | | 3 | 0 |
| నలోపాఖ్యానము, సటీక | ... | 0 | 12 |
| నలచరిత్ర, ద్విపద, చక్రపురి రాఘవాచార్యప్రణీతము | ... | 2 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము, తిక్కనప్రణీతము | ... | 2 | 8 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడది | ... | 2 | 8 |

శ్రీరస్తు

# కవిసంశయవిచ్ఛేదము

అడిదము సూరకవీంద్రకృతము

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారిచేఁ

పరిష్కృతము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స

వారిచేఁ బ్రకటితము

Printed by
V. Venkateswara Sastrulu
of V. Ramaswamy Sastrulu & Sons
at the 'Vavilla' Press
Mad as.—1955.



ఆడిదము సూరకవి బాకు

## పూర్వముద్రణమునందలి

# మనవి

ఆంధ్ర ప్రపంచమున నడిదము సూరకవి శేఖరు నెఱుంగని వా రరుదు. ఈతనిచే రచియింపఁబడిన యీకవిసంశయ విచ్ఛేద మనులక్షణగ్రంథ మాంధ్రకవీంద్రుల కత్యంతోపయోగ కర మైనది. ఛందోగ్రంథముల నభ్యసించినను తీరని కొన్ని సంశయములను దమకుఁ దామే తీర్చుకొనుట కీగ్రంథ మెంతయు సహాయకారి యనునది నిర్వివాదాంశము. ఇట్లమితోపయోగ కర మై కవిశిరోమణి యగుసూరనార్యునిచే రచింపఁబడిన యీ యమూల్యగ్రంథరత్న మేలొకో నేఁడు ప్రచారమున నంతగాఁ గానరాకున్నయది!

ఈగ్రంథమును నేను మిత్రు లొకరివలన తాళపత్ర ప్రతి నొకదాని సంపాదింపఁగలిగితిని. అద్దాని నెత్తి వ్రాయుచుండఁగా పార్వతీపురమునందలి హైమవతీగ్రంథాలయమునం దొకముద్రితజీర్ణప్రతి గాంచఁగలిగితిని. అయ్యది యద్దాని ప్రకాశకులచే నాలుగైదు ప్రతులచేఁ బరిష్కరింపఁబడినట్లు గానవచ్చెడిని. నే నారెండు ప్రతులను నాయోపికకొలంది పరిశీలించినాఁడను. ఉదాహరణరూపముగ నొసంగినపద్యములయందు చాల వఱకు పాఠాంతరములు గలవు. కాని నేను వాని నెల్ల నుదాహ

రింపఁ బూనుకొనలేదు. మాతృకయందు గన్పట్టిన స్వల్పదోషంబులఁ గొన్నింటిని నాశక్త్యనుసారముగ నచ్చటచ్చట సరిజేయ సాహసించితిని. నా ప్రయత్నము పూర్ణముగ నెఱవేరిన దని నాకే మాత్రమును నమ్మకము లేదు. పండితబృందము సాహసమును మన్నించెదరు గాక యని వేఁడెదను.

ఈ గ్రంథమందుఁ గలగాఢాభిమానముచే నెట్లయిన దీని నాంధ్రలోకమున విస్తరింపఁజేయఁ దలంచి సుమారు 75 సంవత్సరములు యెడతెగని భాషాసేవ నొనర్చుచు లెక్కలేనిగ్రంథరత్నముల నాంధ్రుల కందిచ్చు శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండుసన్స్‌వారి కియ్యది నే సంపాదించినతెఱంగెఱింగించి యిద్దానిఁ బ్రకటింప మని యిది వ్రాసి పంపితిని.

మకాము
విశాఖపట్నముజిల్లా
24-7-'25.

ఇట్లు
సర్వజనవిధేయుఁడు
పురిపండా అప్పలస్వామి
సాలూరు.

# పీఠిక

తెలుఁగుభాషకు లక్షణము ప్రాచీనకాలమునఁ బ్రాయికముగాఁ బద్యరూపముననే వెలసినది. అది లక్షణగ్రంథ మను పేరఁ బరఁగుచు భాష, ఛందస్సు, వ్యాకరణము, అలంకారము మొదలగు విషయవిభాగము లన్నింటిని గాని, యందుఁ గొన్నింటిని గాని ప్రతిపాదించునదై యొప్పారుచున్నది. అట్టి లక్షణ గ్రంథములలో నడిదము సూరకవిచే రచింపఁబడిన కవిసంశయ విచ్ఛేదము పేర్కొనఁదగినది.

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. బాలభాస్కరమంత్రి పుత్త్రుఁడు. చినలచ్చుమంత్రి పౌత్త్రుఁడు. ఈవిషయము కవిసంశయ విచ్ఛేదములోని యీ క్రిందిపద్యమువలనఁ దెలియవచ్చు చున్నది.

క. చినలచ్చుమంత్రి తనయుని
నవఘుని మజ్జనకు భాస్కరామాత్యమణిన్
గొనియాడెద శ్లాఘాలం
ఘనజాంఘికకవనధాటిఁ గలిగిన మేటిన్.

ఇతఁడు 'భూపాలరాజురేగ' యనుగ్రామమున క్రీ. శ॥ 1720 సంవత్సరప్రాంతమున జనన మందెను. ఈ గ్రామము విజయనగరమునకుఁ దూర్పుగా నైదుక్రోసులదూరమున నున్నది. దీని కిప్పటిపేరు పూసపాటిరేగ. తనతండ్రి మరణా

నంతర మీతఁడు తనస్వగ్రామ మగు రేగను విడిచి చీపురుపల్లెకు మిక్కిలి సమీపమున నున్న రామచంద్రపురమును దననివాసస్థలముగా నేర్పఱుచుకొని యామరణాంత మచ్చటనే నివసించి యుండి క్రీ. శ॥ 1785 వ సంవత్సరప్రాంతమునఁ గీర్తిశేషుఁ డయ్యెను.

పదునెనిమిదవశతాబ్దియందుఁ బ్రసిద్ధి గాంచిన కవియు, లాక్షణికుఁడునైన సూరకవి 1. చంద్రమతీపరిణయ మను నామాంతరము గల కవిజనరంజనము, 2. కవిసంశయవిచ్ఛేదము, 3. చంద్రాలోకము, 4. ఆంధ్రనామశేషము, 5. రామలింగేశశతకము, 6. శ్రీరామదండకము అను గ్రంథములు రచించెను. ఇతని కవిజనరంజనము ప్రౌఢకవిత్వపరిపాటి నొప్పారి 'పిల్లవసుచరిత్ర'మని ప్రసిద్ధి గాంచినది. ఇవి గాక యీతఁడు సమకాలికులపైఁ జెప్పినచాటువులు పెక్కులు గలవు. (చూ. చాటుపద్యమణిమంజరి.)

ఇతని కవిసంశయవిచ్ఛేదము మూఁడు ప్రకరణముల లక్షణగ్రంథము. ఇందలి ప్రకరణములకుఁ దరంగము లని పేరు. అందు మొదటి రెండు తరంగములయందును గవి తనకుఁ బూర్వమున వెలసినవ్యాకరణములలో లేని కొన్ని నూతనవిషయములను జేర్చి, వానికి సూత్రములు గల్పించి భారతాది ప్రాచీనగ్రంథములనుండి వానికి లక్ష్యములను జూపియున్నాఁడు. రెండవ తరంగమునందు శకటరేఫనిర్ణయమునుగూర్చి కొంతవఱకును, మూఁడవతరంగమునందుఁ దద్భవములు గలిగినవిధమునుగూర్చి

కొంత విపులముగను వివరించియున్నాఁడు. మఱియు భారతాది గ్రంథములయందు మహాకవులు ప్రయోగించిన ప్రయోగము లను సూరకవి లక్షణసమ్మతములుగా సాధించి 'కవిసంశయ విచ్ఛేదము' గావించెను. ప్రాచీనగ్రంథములనుండి యీతఁ డాయాయి సూత్రములకు లక్ష్యములుగా నొసఁగినపద్యము లాతని లక్ష్యపరిజ్ఞానమునకు నిదర్శనములు!

ఈ లక్షణగ్రంథ మింతకుఁ బూర్వము శ్రీ పరవస్తువారి చేతను, శ్రీవావిళ్లవారిచేతను రెండుపర్యాయములు ముద్రింపఁ బడినది. దీని ప్రథమముద్రణప్రఁ బ్రతు లన్నియుఁ జెల్లిపోవు టచే శ్రీ వావిళ్లవారు దీనికి ద్వితీయముద్రణము వెలయించు నుద్దేశముతో దీని నా కొసఁగి పరిష్కరించి యిండని కోరిరి. యథామతిఁ బరిష్కరించి పండితలోకమునకు దీని సమర్పించు కొనుచున్నాఁడను. నాయందలి వాత్సల్యముచే నా కీయపూ ర్వావకాశము నిచ్చి నాచే భాషాదేవికి నీ చిన్నియూడిగముఁ జేయించిన భాషోద్ధారకులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి గారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. వారికి భగవంతుఁడు దీర్ఘాయురారోగ్యములను గలిగించును గాక యని భగవంతునిఁ బ్రార్థింతును.

విజయ మకరసంక్రాంతి

విద్వద్విధేయుఁడు
తిమ్మావఝ్ఝల కోదండరామయ్య.

# మున్నుడి.

అడిదముసూరకవిచరిత్ర తొలుత రచించినది శ్రీగురుజాడ శ్రీ రామమూర్తిగారు. ఆ చరిత్ర శ్రీ రామమూర్తిగారి కవిజీవితములలో చేరలేదు. ఇట్లే కూచిమంచితిమ్మకవి, ఏనుగు లక్ష్మణకవి మొదలగువారి చరిత్రలును చేరలేదు. ఆవెనుక నీ కవిచరిత్ర వీరేశలింగముపంతులుగారు తృతీయభాగమున 95-110 పుటలలో వ్రాసి యున్నారు. మఱియు సూరకవి కృతగ్రంథము లన్నింటిని సేకరించి క్రీ. శ॥ 1899 లో నొక సంపుటముగ ప్రకటించి సూరకవి కీర్తి నినుమడింపజేసినవారు శ్రీ వీరేశలింగముపంతులుగారే! ఆ వెనుక క్రీ.శ॥ 1919లో తద్వంశీయులగు శ్రీ అడిదము రామారావుపంతులుగారీ సూరకవిచరిత్రను రచించిరి. ఆ కాలమున ప్రత్యేకముగా నొక్కొక కవిని గూర్చి సమగ్రముగా రచితము లైనవి పెక్కులు లేవు. ఉన్నవాని నిం దుదాహరించుచున్నాను.

1893. పింగళిసూరన. శ్రీదక్షిణామూర్తిపండితుడు.

1900. నన్నయభట్టారకచరిత్ర - శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి.

1906. శ్రీనాథచరిత్ర - కూనపులి శ్రీలక్ష్మీనరసయ్య.

1917. తిక్కనసోమయాజి - శ్రీ చిలుకూరి వీరభద్రరావు.

చూ. తెనుగుకవులచరిత్ర. పీఠిక పుట. 16. మదరాసు విశ్వవిద్యాలయ ప్రకటితము.

1917. నాచన సోమనాథకవిజీవితము శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు. కొన్నిపుటలు మాత్రమే ప్రకటిత మైనవి.

1918. శ్రీనాథకవి - శ్రీ చిలుకూరి వీరభద్రరావు.

1919. తిక్కనసోమయాజివిజయము-శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి

శ్రీ రామారావుగారి గ్రంథమును, తిక్కనసోమయాజి విజయమును సమకాలికములు.

క్రీ. శ॥ 1924 లో శ్రీ వంగూరి సుబ్బారావుగారు శతకకవుల చరిత్రలో (263-268) సూరకవిచరిత్ర వ్రాసి యుండిరి. అది యీ సూరకవిచరిత్ర నాధారముగ చేసికొనినదే.

సూరకవిచరిత్ర ప్రకటనకు పూర్వమే శ్రీరామారావుగారు క్రీ. శ॥ 1913లో "చెఱువుమీఁదిపద్యములు" అనునొక చిన్న గ్రంథమును ప్రకటించి, "కదలు మిట మాని దివిజగంగాభవాని" అని చెప్పి తనపొలమునుండి గంగను మళ్లించినకవి సూరకవి కా డనియు, నాతడు రామకవి యనియు సోపపత్తిక ముగ నిరూపించి యున్నారు. సూరకవిచరిత్రలో నాతడు విశాఖపట్టణమండలములోని చీపురుపల్లితాలూకా రామచంద్రపురవాస్తవ్యు డని కూడ నిరూపించియున్నారు.

అయినను నీనాఁడు ప్రకటితము లైనగ్రంథములలో నీవిషయములు సంగ్రహింపబడలేదు. ఈ నడుమ నొకగ్రంథమున సూరకవి గోదావరీ మండలములోని కాకినాడతాలూకా రామచంద్రపురము వాస్తవ్యు డని వ్రాయబడియున్నది. అది యొక పాఠ్యగ్రంథము.

పాఠ్యగ్రంథముమాట యటుండ నిండు. పెద్దగా పరిశోధన చేసినట్లు వ్రాసికొన్న 'శతకవాఙ్మయసర్వస్వము' 214-225 పుటలలో సూరకవి చరిత్రలో (220 పుట) చెఱువుమీఁదిపద్యములు సూరకవి వని వ్రాయుట యప్రామాణికము.

ఈ సూరకవిచరిత్రమును శ్రీరామారావుగారు శాస్త్రీయ మగుపరిశోధన పద్ధతులపై వ్రాసిరి. దీనినిగూర్చి ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సం. 7. సం. 4. పుట. 351 లో నిట్లున్నది. "సూరకవిచరిత్రను వర్ణించునప్పు డేమి ఆతని కృతుల విమర్శించునపు డేమి యా కవి తమవంశమువా డనునభిమాన మేమియుఁ బెట్టుకొనక శ్రీరామారావుగారు మొత్తముమీఁద సమభావమునే పాటించుట ప్రశంసార్హము."

కాబట్టి ప్రస్తుతపరిస్థితులలో ప్రామాణిక మగుసూరకవిచరిత్రను తిరిగి వావిళ్లవారు ముద్రించుట సమంజసమే కాక యావశ్యకము కూడ నగుచున్నది. దీనిని ముద్రించి. ఆంధ్రవిద్వల్లోకమున కందజేసిన శ్రీ వావిళ్ల వెంకటేశ్వర శాస్త్రిగారికి నాంధ్రు లందఱును కృతజ్ఞత చూపవలసియున్నది.

నిడుదవోలు వెంకటరావు.

# పీఠిక

తెలుగుసీమకు నుత్తర ప్రాంతమున నున్న కళింగదేశము (అనగా పూర్వపు విశాఖమండల, గంజాముమండలములు)లో క్రీ. శ॥ 11వ శతాబ్దినుండియు తెలుగు కవితారచన వర్ధిల్లుచున్నది. దీనికి క్రీ. శ॥ 1075 నాటి దీర్ఘాసి శాసనమే ప్రమాణము. అది సీసపద్యమాలికగా నున్న శాసనము. క్రీ. శ॥ 1149 లో, క్రీ. శ॥ 1209 లో ముఖలింగమున సీసపద్యశాసనములు గలవు. కాలక్రమమున క్రీ. శ॥ 1402-1410 ప్రాంతములలో ఎలమంచిలిని పరిపాలించిన విశ్వేశ్వరరాజునకు కృతిగా విన్నకోట పెద్దన "కావ్యాలంకారచూడామణి" అను నలంకారగ్రంథమును కృతి యిచ్చియున్నాఁడు. ఇది తెనుఁగు వాఙ్మయమున మనకు లభ్యమైనవానిలో ప్రథమాలంకార శాస్త్రగ్రంథము. క్రీ. శ॥ 1550 ప్రాంతములలో చెన్నాప్రెగడ చెన్నకవి ఎలమంచిలి సర్వసిద్ధితాలూకాలలో నుండెడివాడు. ఈతనికి 'కవిరాజ కలహంస' అని బిరుదనామము. ఈతడు రచించిన తెలుగు గ్రంథములు లభ్యము కాలేదు. ధర్మలింగేశ్వరస్వామిస్తుతి సంస్కృతము పంచరత్నములు మాత్రము ముద్రితములు.

క్రీ. శ॥ 16-17-18-19 వ శతాబ్దులలో చాలమంది కవులు వెలసిరి. కవికుటుంబములు కళింగాంధ్రమున వృద్ధి నందినవి. వీరిలో అడిదమువారు, కాళ్లకూరివారు, ప్రయాగవారు, వద్దిపర్తివారు, వేలూరివారు, మండపాకవారు, కొటికలపూడివారు, కాకరపర్తివారు ముఖ్యులు. వీరు గాక, రమారమి 200 మంది కవులు శిష్టుకరణశాఖకు సంబంధించినవారా ప్రాంతమున నున్నారు. వారిలో పక్కివారు, కళ్లేపల్లివారు, డబీరువారు మాత్రమే ప్రసిద్ధి కెక్కినవారు. ఈ శాఖవారే కాక నితరశాఖీయులగు వైవారిలో

అడిదము సూరకవివంటివా రీవఱకు వాఙ్మయచరిత్ర కెక్కినను, వారినిగూర్చి సరి యగుచరిత్ర తెలియకున్నది. కాబట్టి యీ గ్రంథమున నొక్క యడిదము వారినిగూర్చి వ్రాసెదను. ఇటీవల మచ్చా వేంకటకవిగారు, త్రిపురాన సూర్య ప్రసాదరావుగారు కూడ ప్రసిద్ధులే. కాని యీ కళింగాంధ్రవాఙ్మయమును గూర్చి విశేషము పరిశోధన జరుగకుండుటచేత వీరినిగూర్చి గాని నీ వాఙ్మయ విశిష్టత గాని యాంధ్రలోకమున కెఱుకపడలేదు.

## అడిదమువారి వంశవృక్షము

నియోగిశాఖ. వసిష్ఠగోత్రము. వీరు తొలుత మోదుకూరువారు. ఆవెనుక గంధవారణమువారు. అపైని అడిదమువారు. ఈ వంశీయులలో నొక డగు నీలాద్రికవి ప్రాంతముల 'అడిదము' జహఁమలిగా గొనుటచే నప్పటినుండి యీ పేరు వ్యాప్త మైనది. ఈ వంశీయులలో ప్రసిద్ధు డడిదము సూరకవి. ఈతడు తనవంశమునం దిరువదిమూడు పూరుషాంతరములనుండి కవిత్వము వచ్చుచున్నట్లుగా నీక్రిందిరీతిని చెప్పియున్నాడు.

ఇరువదిమూడు పూరుషము లిప్పటి కయ్యె కవిత్వవృత్తిచే
నరపతు లెల్ల మెచ్చఁ బదునాల్గుతరంబులు మించుపిమ్మటన్
వెరవగు జీవనస్థితి లభించుట తొమ్మిది యయ్యె పూరుషాం
తరమున ని క్కళింగవసుధాధవు చెంగట నాశ్రయించుటల్.

ఈ వంశీయులలో నంతకుముందు 14 తరముల కవులనుగూర్చి తెలిసి కొనుట కవకాశము లేదు. కళింగరాజువద్దకు వచ్చినదగ్గఱనుండి వీరి వృత్తాంతము మనకు తెలియుచున్నది. ఈ కళింగరాజు పూసపాటి తమ్మిరాజు. ఆతడు క్రీ. శ|| 1450 ప్రాంతమున నున్నవాడు. ఆతనివద్ద ప్రఖ్యాతి పొందిన యతడు నీలాద్రికవి కాబట్టి యీ వంశవృక్షము నీలాద్రి కవితో ప్రారంభము.




వీరినిగూర్చిన విశేషములు.

1. నీలాద్రికవి:—ఈతఁడు రణరంగవిజయ మను కావ్యము రచియించెను.

"గీ. కదనపార్థుఁ డంచె కవిరాజు నీలాద్రి, అల కళింగరాజు లడిద మొసఁగ
నిందుచేత నయ్యె నింటిపే రడిదము, రామరాయవినుత రామచంద్ర."

2. నరసింహమంత్రి:—ఇతడు గజపతులయొద్ద సేనానాయకుడుగా నుండెనట.

"గీ. మా నృసింహమంత్రి సేనానిగాఁ దొల్లి
గజపతీంద్రు గొలిచి కటకమందు
అడిద మన్వయంబు నన్వర్థముగఁ జేసె
రామరాయవినుత రామచంద్ర." శ్రీరామ స్తవము - స్వవిషయము

3. భాస్కరుఁడు:—1. కథానాయకుఁడగు సూరకవితండ్రి. ఈతనిని బాలభాస్కరుఁ డని కూడ వ్యవహరించెదరు. ఈతని కృతి శుద్ధాంధ్రరామాయణము. అది లభ్యము కాలేదు. సూరకవి కవిసంశయవిచ్ఛేదములో ఇకార సంధికి లక్ష్యముగా "నిగిడిరువై పులక్ వెడల నేటయి నీటగు వీటికోట" అను చంపకమాలికాపాదము బాలభాస్కరుని శుద్ధాంధ్రరామాయణములోని దని యుఁదాహరించి యున్నాఁడు. ఇది తప్ప వేఱుగా నుదాహృతులు కూడ కన్పించుట లేదు. లభ్యమైనచో నిది కూచిమంచి తిమ్మకవి యచ్చతెనుగు రామాయణముకన్న కొంచెము పూర్వపు దని చెప్పనొప్పును. నాటిది, ఈతని వేఱొక గ్రంథము లక్షణసారము. ఇం దక్షరఫలములు, తెలుగు ఛందో లక్షణములనుగూర్చి చెప్పబడినవి.

4. సూరకవి:—(1720-1785) ప్రస్తుత సూరకవిచరిత్ర కథా నాయకుఁడు. సర్వాంధ్రదేశ ప్రసిద్ధుఁడు. సూరనకొడుకు భాస్కరుఁడు. పండితపుత్రుఁడు.

5. సూరన:—(1778-1823) ఈతని కొడుకు సూరకవి మనుమడు, ఈతడు ప్రసిద్ధపదకవి యగునడిమింటి రామజోగికవిగారి సమకాలికుడు. రామ జోగి కవి యీతనిగూర్చి యీ క్రిందిపద్యము జెప్పె నని వాడుకలోనున్నది.

మ. కవిరాజుల్ గల రెందఱైన నిఖిలక్ష్మాచక్రమధ్యంబునం
దవుగానిమ్ము నిరర్గళప్రకటశాపానుగ్రహాఖండవై
భవశుద్ధాంధ్రవచోధురంధరఘనప్రాబంధికుల్ వేరె వే
రవురా శ్రీయడిదంబు సూరకవిచంద్రా! సాంద్రతేజోనిధీ!

6. బాలభాస్కరుఁడు:—(1808-1874) ఈతఁడును తండ్రివలెనే ప్రసిద్ధుఁడు. ఉద్దండవిద్వత్కవి యగుశిష్టు కృష్ణమూర్తిశాస్త్రి సమకాలికుఁడు. విశాఖమండలమున మాడుగుల కృష్ణభూపతి యాస్థానము నలంకరించినవాఁడు.

మాడుగుల కృష్ణభూపతి (1813-1873) సభలో నీ కవు లిద్దఱును నెట్లు ప్రకాశించి యుండెడివారో, కృష్ణభూపతి యాస్థానకవి యగు మంత్రి ప్రెగ్గడ సూర్యప్రకాశకవి చెప్పిన యీ క్రింది పద్యమువలన తెలియనగును.

క. సాగా గలకవు లిద్దఱు
బాగొప్పఁగ కృష్ణమూర్తి భాస్కరులు, మహా
భోగులు, గవ్యనురాగులు
గోగణపాలకులు మాడుగులసభలోనన్.

ఈ బాలభాస్కరకవి 1. శ్రీవేంకటేశ్వరశతకము, 2. జానకీరామశతకము, 3. భోగలింగశతకము, 4. సింహాశైల నృసింహశతకము మొదలగు శతకములు, చాటుపద్యములు, పదములు రచియించెను. మఱియు తన ప్రభువుపేర శ్రీకృష్ణభూపతి తారావళిని రచియించెను. దానినుండి కొన్నిపద్యముల నుదాహరించుచున్నాను.

క. శ్రీమన్మృగ రా"జాశ్విని", సోమకళాభరణ గౌరి శుంభద్విభవ
స్తోమ మిడు నీకు శ్రితసుర, భూమిజ మత్స్యకులకృష్ణభూప లలామా!

క. వరరత్నాకరవలయా, "భరణి"త కరుఁడ వగునిన్నుఁ బ్రస్తుతి సేయుం
దరమా సత్కవివరులకు, సరసాగ్రణి కృష్ణభూప స్మరభవరూపా,

క. ధరణీశోత్తర భాద్రాకర! రక్షింపు మను శత్రుగణముల నెల్లం
గరుణించి ప్రోచుచుందువు, సరసాగ్రణి కృష్ణభూప! స్మరనిభరూపా!

క. "రేవతి" యనుకామిని తను, సేవింపఁగఁ దలఁచు సుగుణశీలికి నసుఖుం
డై విలసిల్లెడు వానిం, భావించెదు కృష్ణభూప భావజరూపా!

క. తారావళి యనుకావ్యము, తారావళికరణిఁ గూర్చి తనరఁగ నీకుం
జేరుగ నొసఁగితి నది గొని, భూరికృపం బ్రోవు కృష్ణభూపతివర్యా!

ఈ బాలభాస్కరకవియు ప్రపితామహుఁ డగుసూరకవివలె శాపానుగ్రహసామర్థ్యము గలవాఁడు. చల్లా పట్టాభిరామయ్య అను మొఖాసాదారునిగూర్చి యీతనిపద్యము అడిదమువారి శాపానుగ్రహశక్తి సమర్థతలను తెలుపును.

సీ. విజయరామక్షమావిభుఁ డిట్టి భాసిల్లె, ధరణిలో మా ప్రపితామహుండు
గంగాభవానిని కడుదిట్టయై తిట్టె, ఖ్యాతిఁ జెన్నొందె మాతాత యొకఁడు
వెలయంగ మగటపల్వెంకనఁ బడఁదిట్టె, తగఁ డెగటార్చె మాతండ్రిగారు
ఆరీతిగాఁ బట్టి యమరపురమునకు, నిన్నుఁ బంపఁదలంచి యున్నవాఁడఁ
గీ. గాచుకొ మ్మిటమీద నఖండచండ, దారుణోద్దండ కవితాగభీరశక్తి
నీతరము గాదు కలహించి నిర్వహింపఁ, జల్లపట్టాభిరామ నీచగుణధామ!

భాస్కరునితండ్రి సూరన మగటపల్వెంకనఁబడదిట్టి యాతని తెగటార్చె నని పైపద్యమున నున్నది. ఈమగటపల్లివెంకన్న వైశ్యకులజుఁడు. మగటపల్లికామయ్య యనువణిక్ శ్రేష్ఠుఁ డీతనితండ్రి. ఆతఁడు పచ్చమెట్టపాపకవిచే, తన పేరిట నొకశతకము చెప్పించికొని యాతని సన్మానించిన వదాన్యుఁడు. బహుశః కామయ్యకొడు కగు వెంకన్న తండ్రివలె, కవులను పోషింపక వారికి వ్యతిరిక్తముగ వ్యవహరించుచు వచ్చినాఁ డని పైపద్యపాదమువలనఁ దెలియుచున్నది. ఏసందర్భమున నిది జరిగినదో యింకను పరిశోధింపఁదగియున్నది.

శ్రీబుచ్చివెంకట్రాయులు (1860-1920). వీరు చిన్నతనముననే కవనము చెప్పి రాజమహేంద్రవరమున విద్వత్సభను మెప్పించి గొప్పబహుమానము గొన్నవారు. వీరు 1924 లో ప్రకటితమైన శతకకవులచరిత్రకెక్కిరి. ఆ గ్రంథములో 403-404 పుటలలో నీతనిగూర్చి యిట్లున్నది.

"ఈతఁ డడిదము బాలభాస్కరకవిపుత్రుఁడు. శ్రీవిజయనగర సంస్థాపితమగు అన్నమరాజుపేట"లో రివిన్యూయిన్‌స్పెక్టరుగాఁ బనిచేసియున్నాఁడు

భాస్కరకవి అడిదముసూరన్నకొడుకగుటచే నీకవి సూరకవి మనుమఁడని తెలియుచున్నది. 'శంకరా'యను మకుటముతో 128 పద్యములు గలశంకరశతకమును రచియించి యున్నాఁడు. అడిదముసూరకవివంశీయులలో కొందఱు బాలురు సహితము పద్యము లల్లగలధారాశుద్ధి గలవా రని తెలియుచున్నది. ఇతఁడు తుట్టతుదపద్యముల నిట్లు వ్రాసియున్నాఁడు.

చ. అడిదము సూరయాహ్వయమహాకవిపౌత్త్రుఁడ భాస్కరార్యపు
త్త్రుఁడ కవిరాజహృత్కమలతోయజమిత్త్రుఁడ వేంకటాఖ్యుఁడన్
పుడమినిఁ దావకాంకితముఁ బూనుచు నీశతకం బొనర్చి తి
య్యెడ సుమమాలరీతిని రహిం గొను మర్పణ సేతు శంకరా !

చ. తెలియదు నీదుమాయ జగతీధర! పుట్టుచుఁ గిట్టుచున్నవా
రల ధరలో ననేకుల నిరంతరమున్ గనుగొంచు జన్మ ని
ష్ఫల మని లో నెఱింగి భవబంధనిబద్ధులు నై సుతాంగనా
నిలయధనాదుల న్విడువనేర రదెంతటివింత శంకరా !

చ. దురితుఁడు వీఁ డటంచుఁ గృపతో నను రక్షణ చేయకుండినన్
ధరణి దిగంతరిక్షమున దర్పితమై మహితప్రతీతమై
పరగుచునున్న నీపతితపావననామ విరాజమానమా
బిరుదుకు మోసముల్ గలుగునే మదభీష్టము నిమ్ము శంకరా !

కొన్నిలక్షణదోషములు కన్పట్టుచున్నవి. కవిత్వము ధార కలది. అక్కడక్కడ నూతనాభిప్రాయము లున్నవి. శైలి చక్కగ నున్నది. ఇతఁడు సూరకవి మనుమఁ డగుటచే క్రీ. శ॥ 1820 ప్రాంతములవాఁడై యుండవచ్చును."

కాని బుచ్చివెంకటరాయలతాత సూరకవి కవిజనరంజనాది కృతికర్త యగు సూరకవి కాఁడు. అతనిమనుమఁ డగు సూరకవి. ఈతఁడుకూడ కవియే. ఈతనిగూర్చి ముందు తెలిపితిని. ఈ సూరకవి క్రీ. శ॥ 1820 ప్రాంతమున నుండుటచేత, శతకకవులచరిత్రమున చేయఁబడిన కాలనిర్ణయము సరికా దని

రెయిుఁగఁదగును. ఈపీఠికారచయిత చిన్నతనములో నీతని చక్కఁగా నెఱిఁగి యున్నాఁడు.

**సూరకవికృతులు** సూరకవి వాఙ్మయశాఖలలో నొక్కొకదాని కొక్కొక యుదాహరణముగా కృతులు రచించెను.

| | |
|---|---|
| ప్రబంధము | కవిజనరంజనము |
| అలంకారశాస్త్రము | చంద్రాలోకము |
| వ్యాకరణచ్ఛందోలక్షణము | కవిసంశయవిచ్ఛేదము |
| శతకము | రామలింగేశశతకము |
| నిఘంటు | ఆంధ్రనామశేషము |
| దండకము | శ్రీరామదండకము |

సూరకవి సూటి యగు చాటుకవిత్వమున ప్రశస్త మగు ప్రబంధ కవిత్వమున ప్రసిద్ధుఁడు. సూరకవి ప్రజాకవి. ఆంధ్రవాఙ్మయ మున్నంతకాలము నాతని చాటువులు వెలయఁగలవు. పైవాని వివరణము.

**కవిజనరంజనము.** ఈ ప్రబంధము పిల్లవసుచరిత్ర మని ప్రఖ్యాతి జెందినది. దీనికి నవతారిక లేదు. ఇందు గ్రంథారంభమున ముద్రింపఁబడిన

"క. కంఠీరవాఢ్యవిక్రమ, కుంతునకును కుంభిదైత్యకోపాటోపా
కుంతప్రతాపహారునకుఁ, గంతేకాలునకుఁ బ్రమథగణపాలునకున్."

అనుపద్యము నాగులాటి శివనారాధ్యకృత మగు శ్రీశైలఖండము లేక శ్రీపర్వతపురాణము అను కావ్యమునందలి షష్ఠ్యంతములలోనిది. శివనారాధ్యుఁడు క్రీ. శ॥ 1500 ప్రాంతమువాఁడు. కావున లేఖకు లెవ్వరో దీనిని కవిజనరంజనప్రతులలో నెక్కించి యుందురు. ఈ చరిత్రమున 4 వ పుటలో నున్న యీ క్రిందివాక్యములే పై యభిప్రాయమున కాధారము.

"క. కంఠీరవాఢ్యవిక్రమ.........

మాయింటనున్న ప్రతులలో నీపద్యము కానరాదు. సూరకవి తన ప్రబంధము నవతారికాపద్యములు చెప్పియుండెనా లేదా యన్నయంశము కొంతవఱకు నాలోచింపవలసి యున్నది."

ఈగ్రంథము తొలుత 1889 లో తెన్నరం వేంకటరంగాచార్యుల వారిచే ముద్రిత మైనది. ఆ వెనుక నీక్రింది ముద్రణములు గలవు.

1899. శ్రీవీరేశలింగము పంతులుగారు కీ. శే.

1930. శృంగారగ్రంథమాల - శ్రీగంటిసూర్యనారాయణశాస్త్రి

1932. వావిళ్లవారు

దీనింగూర్చిన విపులవిమర్శన మీ గ్రంథమునం గలదు. బ్రౌనుదొరవారు తమనిఘంటువులో కవిజనరంజనము పేర్కొన్నారు. పుట 7 Adidem 4 ఆడిదము సూరన్న ప్రణీతం బైన కవిజనరంజనం quoted under పాణింధమ.

## చంద్రాలోకము

ఈ యలంకారగ్రంథమును తొలుత ఆర్ష ముద్రాక్షరశాలలో క్రీ. శ॥ 1900 లో కీ. శే. శ్రీచావలి సుబ్రహ్మణ్యశాస్త్రులవారు మూలశ్లోకము లొకవైపు, సూరకవి పద్యము లొకవైపు చక్కగా ముద్రించి గ్రంథప్రచార మునకు తోడ్పడిరి. ఇందలి విశేష మే మనంగా చంద్రాలోకములోని రమారమి 40 శ్లోకములకు సూరకవి పద్యములు లేకపోంగా వానిని జగద్విఖ్యాత పండితు లగు మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు వేంకటరంగాచార్యుల వారిచే పూర్తి చేయించి యందే ప్రకటించిరి. ఆవెనుక నిది మంజువాణీ ముద్రాక్షరశాలలో 1904 సం॥ ముద్రితమైనది. కాని పూర్వోక్తవిశేషము లిందు లేవు.

ఈ నడుమ శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవా రీచంద్రాలోకమును రంగాచార్య సూరకవిపద్యములతో గూడ ప్రశస్తముగ ప్రకటించి యున్నారు.

## కవిసంశయవిచ్ఛేదము

ఇది యాంధ్రలక్షణ గ్రంథములలో నొకవిశిష్టత గలది. తెలుగుభాషలో తద్భవప్రక్రియను గూర్చి, యుదాహరణపూర్వకముగ సంపూర్ణముగా చర్చించిన దిది యొక్కటి మాత్రమే. దీని నాధారముగ గొనియే కళాప్రపూర్ణ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రులవారు తమవైయాకరణపారిజాతమున 'తద్భవ ప్రకరణము'ను రచియించి యున్నారు. మఱియు నిందలి విశేషములను గూర్చి శ్రీ విశ్వనాథ వేంకటేశ్వరులుగారు 'భారతి' (1941) లో నొక చక్కని వ్యాసమును వ్రాసియున్నారు. బాలవ్యాకరణ వ్యాఖ్యానములయం దీ గ్రంథముకూడ ప్రమాణగ్రంథముగా గైకొనబడినది.

## రామలింగేశశతకము

సూరకవిగ్రంథములలో నధికవ్యాప్తి జెందినది. వావిళ్లవారి శతక సంపుటములలో నిది ముద్రిత మైనది. శతకవాఙ్మయమున నగ్రస్థాన మధిష్ఠించిన కొలదిశతకములలో నొకటి. దీనికి టీకాతాత్పర్యములతోడను, నాకాలము నందలి చారిత్రకవిషయముల సూచికలతోడను నొక సుపరిష్కృత ప్రతి యావశ్యకమై యున్నది. అప్పు డీ శతకవిశిష్టత చక్కగా వెల్లడి కాగలదు.

## ఆంధ్రనామశేషము

సూరకవి గ్రంథములలో మొదట ముద్రణభాగ్యము నందినది యిదియే. ఆంధ్రనామసంగ్రహముతోఁగూడ క్రీ. శ॥ 1840 లో విశాఖపట్టణములో "లండన్ మిషన్ ప్రెస్సు" నందు పెద్దయక్షరములతో పూర్వరీతిని ముద్రిత మైనది. దీని నీతరువాత వావిళ్లవారు నిఘంటుత్రయములో పదములకట్టి లతో సహా నిర్దుష్టముగ ముద్రించియున్నారు.

## శ్రీరామదండకము

దీని నిప్పటికే పదియేండ్లక్రిందట విశాఖపట్టణమున శ్రీశారదామకుట ముద్రాక్షరశాలలో కీ. శే॥ శ్రీ విన్నకోట అప్పల నరసింహులుసెట్టిగారు ముద్రించియున్నారు.

## పోణుగుపాటి వేంకటమంత్రి పద్యములు

ఇవి యొక శతకముగా కొందఱు భావించిరి. కాని మకుట మున్నవు కొన్ని పద్యములు మాత్రమే లభించుచున్నవి. "ఈ పద్యముల నిటీవలి వా రెవరో యేర్చికూర్చి వానికి వెంకటమంత్రి శతక మని పేరిడిరి గాని శతకరూపమున రచింపఁబడినవి కావు." అని శ్రీ రామారావుగారి అభిప్రాయము. ఇది యెంతయు సమంజసము. వీనిలో కొన్ని స్వల్పగ్రంథపాతములతో ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక పింగళిసంవత్సరమున ప్రకటితము లైనవి. వానిలో లేనివి కొన్ని చేర్చి, సవరించి యిందులో ప్రకటించుచున్నాను.

సూరకవిని అధునాతనులు చాలగా ప్రశంసించియున్నారు. విద్వత్కవి యగు మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి తన కృష్ణార్జునసంవాదములో నిట్లు ప్రశంసించినాఁడు.

క. అడిదము వంశాంబుధి రా
దుడుపతి యన ధరణి వెలసి యుర్వీశులచేఁ
గడు మన్ననఁ గొని యెన్నం,
బడుసూరకవీంద్రుఁ దలఁతుఁ బటుగుణసాంద్రున్.

మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు బిల్వేశ్వరీయములో

గీ. "అధికుఁ డౌను, గాదె యడిదము సూరన్న నియమశూరుఁ డసమనిష్ఠచేత."
అని యీతని పేర్కొన్నారు.

రెండవకోవ రామకవి 1 వంశవృక్షము (12) పుట. ఈతడే 'కదలు మిట మాని దివిజగంగాభవాని' అని చెఱువుమీఁదపద్యములు చెప్పినకవి. ఈతఁడు రామారావుగారికి ప్రపితామహుఁడు.

ఘనకవిత్వశక్తి గంగాభవానిని, గెలిచి లోకమందు కీర్తిఁ గొన్న
రామకవివరేణ్యు ప్రపితామహు నుతింతు,రామరాయవినుత రామచంద్ర!

సన్న్యాసిరాజు లేక సన్న్యాసికవి. ఈతఁడును కవియే. శతకకవుల చరిత్ర కెక్కని యీ క్రింది రెండుశతకములను రచియించెను.

కేశవశతకము, కేశవా యనుమకుటము

ప్రారంభము:—

ఉ. శ్రీరమణీముఖాబ్జసరసీరుహబాంధవ, శక్రముఖ్య బృం
దారకవార్ధి వార్ధిజదదంబున నిన్ను భజించెదన్ ననుం
గారవ మొప్పఁగాఁ గరుణఁ గావుము భక్తసుఖప్రదాత యో
వారిరుహాయతేక్షణ కృపాయతవీక్షణ కృష్ణ కేశవా!

చివఱ:—

ఉ. మంగళ మబ్ధిజారమణ మంగళమాత కవిస్ఫురద్ద్వయా
మంగళ మవ్యయా పరమమంగళదివ్యచరిత్ర శ్రీహరీ
మంగళ తూర్యసేవ్యరవిమండలమండిత దివ్యభూషణా
మంగళ మాదిదేవ జయమంగళ మో పరమేశ కేశవా!

ఉ. దాసజనప్రమోద యడిదమ్ము కులమ్మునఁ జందురుండు నా
భాసిలు నారసింహకవివర్యుని పుత్త్రుఁడ నీ భటుండ స
న్న్యాసి సమాహ్వయుండ వికచాంబుజనేత్ర భవత్పదాంబుజా
వాసితమానసుండ నఘభంజన నన్గరుణింపు కేశవా!

## రుద్రశతకము, కందములు. R. 307. b and c.

ప్రారంభము :—

క. శ్రీమద్గిరికన్యానన, తామరససరోజమిత్ర ధరణీధర స
ద్ధామ శరజ్జలదార్జున, వామాంగాభక్తదత్తభద్రా! రుద్రా!

క. అక్షీణదయాసంయుత, వీక్షణ నిజచరణకమలవిన్యస్తమనః
ప్రక్షీణకలుషజనసంరక్షణ ననుఁ బ్రోవ వేగ రమ్మా! రుద్రా!

చివఱ :—

క. సేవించితి నీ పదముల, భావించితి దేవుఁడ వని పరమాత్మక సం
భావించితి నిను నామది, వేవేగము వచ్చి కావు కృప నను రుద్రా!

క. అడిదము నృసింహకవి తన,యుండ సన్యాసి యనునాఖ్య యొప్పఁగ నీ భృ
త్యుఁడ నన్ను దయామతివై, యెడపక కరుణించుచుండు మీశ్వర రుద్రా!

ప్రస్తుతగ్రంథకర్తలు:—శ్రీరామారావుగారు ప్రమాదిసంవత్సర పుష్య శుద్ధ ౧౨ స్థిరవారము జననము. తల్లి సుందరాంబ. తండ్రి వీరరాజు. వీరు క్రీ. శ॥ 1902 లో ప్రవేశపరీక్షలో కృతార్థులై కొన్నిసంవత్సరములు విజయనగరము రిపను హిందూ థియోలాజికల్ హైస్కూలులో (ఇప్పుడీ పాఠశాల లేదు.) సహోపాధ్యాయులై యుండి యచ్చట తెలుగు పండితులుగా నున్న పెల్లటూరి శ్రీలక్ష్మాజీగారియొద్ద తెలుగుసాహిత్యగ్రంథములు, వ్యాకరణము చదివి విమర్శనపూర్వకమును, విచక్షణసహితమును నగు నాంధ్రసాహిత్యసంపద నలవఱచికొనిరి. ఆవెనుక వీరు క్రీ. శ॥ 1910-1913 వఱకును మహారాజావారి కళాశాలలో హైస్కూలుతరగతులకు తెలుగు పండితులుగ నుండిరి. క్రీ. శ॥ 1913 నుండి వీరు కాలేజీతరగతులకు (ప్రథమశాస్త్రపరీక్షా, పట్టపరీక్ష) తెలుగుపండితులుగా నియమితులై ఆస్థానమున నిరుపదిరెండేండ్లు అనఁగా క్రీ. శ॥ 1935 వఱకు నలంకరించి యుపకారవేతనము నందిరి. కళాశాలావిద్యార్థులకు సముచితరీతిని సాహిత్య

సంప్రదాయానుసారముగాను తెలుగుపాఠములు చెప్పుటలో వీరికి సమానులు లేరని చెప్పుట యతిశయోక్తి కాదు. వీరు ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ప్రారంభము నుండియు తెలుగుపాఠ్యగ్రంథ సభాసభ్యులుగను పరీక్షకులుగను నుండిరి. వీరి సహృదయత్వము, సౌశీల్యము, సౌమనస్యము, విద్యార్థిలోకమును, విద్వల్లోకమును నొకేరీతిగా నాకర్షించినవి. వారియందటి యాదరాభిమానములను గౌరవమును నెల్లప్పుడు చూఱగొన్నవారు శ్రీ రామారావుగారే యనుట నిర్వివాదాంశము. వారిప్పుడు వృద్ధులై యుపకారవేతనముఁ బొందుచున్నారు. వారు సూరకవి చరిత్ర కాక విస్మృతకళింగాంధ్రకవు లను పేర శ్రీ వీరేశలింగ ప్రభృతులు విడిచిపెట్టిన కళింగదేశకవులఁగూర్చి యొకగ్రంథము ప్రకటించిరి. అది వాఙ్మయచరిత్రకారులకు మిగుల నుపయుక్తమైన గ్రంథము. కీ. శే. శ్రీ గంటి సూర్యనారాయణశాస్త్రిగారి ఆంధ్రవిజ్ఞానసమితి గ్రంథమాలలో ప్రకటితమైనది. ఆసమితి సంస్థాపకులును, భాషాపోషకులును, వదాన్యులును, లోకోత్తరపురుషులును, ధర్మజ్ఞచరిత్రాదిగ్రంథకర్తలును నగు శ్రీ వేపకొమ్మ గురువేంకట సుబ్బయ్య గారీగ్రంథప్రచురణకు తోడ్పడిరి. గ్రంథప్రచురణకు కారకులైన ఈ సూరకవిజీవితమునకు తొలుత పీఠిక వ్రాసిన శ్రీ ఋజ్జా శేషగిరి రావుగారు కీర్తిశేషులైరి. చరిత్ర తిరిగి యీనాఁడు పునర్ముద్రిత మగుటకు కారణభూతులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు. గ్రంథకర్త లగు శ్రీ రామారావుగారు వృద్ధులగుటచే పునర్ముద్రణపీఠికాభారము నాపై నుంచిరి. శ్రీ శాస్త్రులవారును నన్నే వ్రాయఁగోరిరి. పూజ్యులగు వారిరువురికోర్కెననుసరించి దీనిని వ్రాసితిని. ప్రాజ్ఞులు మేలేర్చికొందు రని ప్రార్థన.

చెన్నపురి :
మన్మథ యుగాది
25-3-1955.

నిడుదవోలు వేంకటరావు
మదరాసు విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షుఁడు.

# పోణుగుపాటి వెంకటమంత్రిపై పద్యములు

## అడిదముసూరకవి రచితములు

పోణుగుపాటి వెంకటమంత్రిపైని పద్యములను రచియించిన కవి మహా ప్రసిద్ధుఁడగు నడిదము సూరకవి. ఈ పద్యముల నాతఁడు ప్రాస్తావికముగ నప్పు డప్పుడు చెప్పియుండవచ్చును. కాని శ్రీకారముతో ప్రారంభ మగుచున్న కారణముచేత నివి యొక శతకముగా పరిగణిత మైనవి. ఇందులో 39 పద్యములుమాత్రమే లభించినవి.

ఈ పోణుగుపాటి వెంకటమంత్రి విశాఖపట్టణమండలములోని శృంగవరపు కోట జమీందారులైన ముఖీ కాశీపతిరావుగారి దివానుగ నుండి, దాన ధర్మపరుఁడై, కవిపండిత పక్షపాతియై రాజకార్య నిర్వహణ సమర్థుఁడై, కీర్తి గడించెను. క్రీ. శ॥ 1720-80 ప్రాంతమున నతఁడు జీవించియుండెను. సూరకవి యీతని పొగడినట్లింక నెవ్వరిని బొగడియుండ లేదు. ఈ ముఖీ కాశీపతిరాజుగారివద్ద వేఱొకమంత్రి కృష్ణమంత్రి. ఈతఁడు సృష్టికరణ కులజుఁడు. అండలూరి శరభకవి తన 'ముక్తి చింతామణి' అను పద్యకావ్యమును నీకృష్ణమంత్రికే కృతి నొసగినాఁడు. ఉపలబ్ధము లగు వేంకటమంత్రి పైపద్యము లన్నియు నిందు పొందు పఱుపఁబడియున్నవి.

"శ్రీకర గౌతమకులజుఁడ, కాకుత్స్థ పదాబ్జసేవకప్రవరుఁడ వై
కైకొను మభీష్టసిద్ధి వివేకనిధీ ! పోణుగుపాటి - వేంకటమంత్రీ"

"వెన్నెలవలె కర్పూరపు, దిన్నెలవలె నీదుకీర్తి దిగ్దేశములన్
మిన్నంది వన్నె కెక్కెను, విన్నావా ! పోణుగుపాటి వేంకటమంత్రీ !"

"చుక్కలవలె కర్పూరపు, ముక్కలవలె నీదుకీర్తి ముల్లోకములన్
క్రిక్కిరిసి పిక్కటిల్లెను, వెక్కసముగ బోణుగుపాటి వేంకటమంత్రీ"

లేఁడు భువి వాన దడియని వాఁడు న్నీయింట భుక్తిఁ బడయనిద్విజుఁడున్
బోఁడిమి మీఱఁగ నిన్నున్, వేఁడనికవి పోణుఁగుపాటి వేంకటమంత్రీ.

"వరదానాచారంబుల, గరిమ గని వనీపకులుచు గర్తులును భూ
సురమణి యని నిన్నందురు, విరచితవృష పోణుగుపాటి వేంకటమంత్రీ!"

"జలచరము లబ్ధిఁ బొడమవె, జలరాశికి మోదకరుఁడు చంద్రుఁడొకండే
కుల ముద్ధరింప నొకఁడే, విలసద్యశ ! పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"ఘనకులమునఁ బొడమిన దు,ర్జను జుం డిల నింద్యుఁడగు వమనమూర్ధ్వముఖం
బున వెడలి మంచి దగునా ? విను మవహిత పొణుగుపాటి వేంకటమంత్రీ."
"కలుద్రావు వానితో మూర్ఖులతో జవ్వనులతోడఁ గోడెలతోడన్
గలహింపఁ బోవ రధికులు, విలసన్మతి పొణుగుపాటి వేంకటమంత్రీ !"
"తను దాఁ బొగడిన నల్పుఁడు,ఘనుఁడగు నాఘనుని ఖలుఁడొకఁడుగాదన్నన్
జను లంద ఱతనిఁ బొగడరె విను మవహిత పొణుగుపాటి వేంకటమంత్రీ"
"జగములకు సాక్షి సూర్యుం,డగు సూర్యుని కొక్కసాక్షి యవనిం గలఁడే
తగ వెలుఁగఁడు వెనుమూర్ఖుఁడు, విగతకలుష పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"వెనుమూర్ఖుఁ డాడి కొనఁడా, నను నెఱుఁగరె సేతుశీతనగమధ్యోర్వీన్
తను వెలిగినసుకవీంద్రులు, విను మవహిత పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"నన తేనియ గైకొను భృంగ నిరూఢిని దాత మనసు గందక యుండన్
గొనవలె యాచకుఁ డర్థము, విను మవహిత పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"కినుక మెయిఁ దన్ను లాడఁగ, మొనకట్టిన సరియ గుఱ్ఱము గాడిదయన్
ఘనుఁడల్పునితోఁ బోరునె, విను మవహిత పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"యతి దవ్వుల వలయు వాగను, గతి ధేనువు వెంట నంటి కదలెడువత్సా
కృతి నదియె కవనచతురిమ, వితరణఖని పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"కుశలత్వ మెంత యుండిన, వశమా ? పులినోటి కండ వదలింపఁగఁ దా
దృశపాండిత్యము నీకే, విశదయశా ! పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"శరమొకటి యేయ రిపుపైఁ, బరుగెత్తినఁ గట్టువడియె భాస్కరబింబం
బరిది భవత్సాయక ధృతి, వెలిచికదా పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"జనపతికి మతి దొలంగిన, కొనసాగదు మంత్రి బుద్ధి కుశలతయును శాం
తనవాదులు కురుపతికీ, వి నెగడ్చిరె పొణుగుపాటి వేంకటమంత్రీ."

"ధరణిన్ భౌమాదిగ్రహ, పరీక్షలకె గాక యతఁడు భాస్కరుఁడని యే
ర్పఱుప వలెనె లోకులకున్, విరోధిహర పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"సకలామోదసమద్రుమ, వికసన మొనరించుఘనుఁడు విడిచిన లేఁడా
యొకఘనుఁడు జాతిలతికా, వికసతకును పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"పలరాచపనికిఁ గాదా, వెలవెలఁదుక పాన్పు ద్రొక్క విటుఁడు సహించున్
చల మేల కార్యవాదికి, విలసద్యశ! పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"బలవంతుఁడు బలహీనుఁడు, పొలుతురు విధి దప్ప నల్ల పూసలు ముత్యాల్
తొలుగుగద మగఁడు పోయిన, వెల దుకకున్ పొణుగుపాటి వేంకటమంత్రీ"
"అని భార్గవు దరిగినశం, తనుని తనూజుండు చండతరసాయకముల్
జొనిపెనె శిఖండిమీఁదను, విను మవహిత పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"ఒక్కసముద్రము దక్కఁగ, దక్కినసంద్రములు నీయుదారమహిమచే
జిక్కెఁ గద విప్రభుక్తికి, వెక్కసముగఁ బొణుగుపాటి వేంకటమంత్రీ!"
"నీ మహిమ మొక్కవోవదు, నీమాటయె విష్ణువరము నీ వాక్యము శ్రీ
రాముల బాణము గద తన్వీ మన్మథ! పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"కోయక పెరుగదు బచ్చలి, మేయక పాలీయ దావు, మేదినిలో ద
బ్బీయక రాదు సుకీర్తియు, వేయేలా పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"చేలకడ దిష్టిప్రతిమ మె, కాలం బెదరించు మ్రుచ్చు గావంగలదా?
చాలును మంత్రికుమారుల, వీ లిట్టిది పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"పొగ త్రాగనట్టినోరును, పొగడంగా బ్రదుకనట్టి భూపతిబ్రదుకున్
మగఁడొల్లని సతిబ్రతుకును, వెగటు సుమీ పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"చెడగొఱుకు చీడపురుగొక, పిడికెడు జలక మిడి చెట్టు పెంచునె! చెనుగా
అడివెట్టుఁ గాని దుర్దశ, వెడలించునె పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"జనియింతురు సజ్జన దు, ర్జను లుపకా రాపకార సంఘటన మొన
ర్చను గోవ్యాఘ్రము లట్లను, విను మవహిత పొణుగుపాటి వేంకటమంత్రీ!"

"పరపీడనంబుకంటెను, దురితము సూనృతముకంటె దోరవ్రతమున్
ధర నెంచి చూడఁ గలవా, విరచితవృష పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"చెన్నగు నియోగి కవనపు, మిన్నా వైదికికి నగునె మేదినిలోనన్
జున్నుకు మార్దవ మబ్బునె, వెన్నవలెన్ పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"చొకట్లు వెట్టి మిన్నా, కోకలు తొడిగినను గలవె గురుతరకీర్తుల్
"వా కలిమి లేక యున్న వి,వేకనిధీ! పొణుగుపాటి వేంకటమంత్రీ"
"పొగడను పరకవి కవనము, (పొగడను పరరాజమంత్రి బర్బురతరులన్)
జగ మెల్ల నిన్నుఁ బొగడును, విగతకలుష! పొణుగుపాటి వేంకటమంత్రీ"
" (గనుసేసిరి) సజ్జనుడున్, తనదు ప్రయత్నంబు లేక, దధియైనను ద
ర్చినఁ గాని వెన్న యొసఁగునె, విను మవహిత! పొణుగుపాటి వేంకటమంత్రీ!
"(ప్రోవఁగ నేర్చునె భూపతి), దైవము కృప దప్పె భీష్మతరణిసుతాదుల్
ప్రోవం గలిగిరె కురుపృథ్వీవరునిన్ బొణుగుపాటి వేంకటమంత్రీ!"
"ఏదు రెవ్వరు తనకన నీ, పదునాలుగు జన్మముల తపముఁ జేసి (దా
తుది విధిని గడవ నేర్పునె), విదళితమద! పొణుగుపాటి వేంకటమంత్రీ!"
వివిధపదార్థంబులు ని,ల్వవు దక్షత లేని యింట లక్షలకొలఁదిన్
(అవిసిన గట్టున నిలుచునె, వివరాంబులు) పొణుగుపాటి వేంకటమంత్రీ!
తల యెత్తి మొఱగుఁ గుక్కకు, (గల వారలవలనఁ గొంత) ఘనత లభించెన్
గలభమున కున్న యున్నతి, వెలితి పడెనె పొణుగుపాటి వేంకటమంత్రీ!"
"ఆలచిగురు మెసగు కోయిల,ఫలములు భుజియించు చిలుకపలుకుల కెనయా
(సులలితకవితాసూక్తులు, విలసన్మతి) పొణుగుపాటి వేంకటమంత్రీ"

కళింగదేశమున నీ పద్యములు చాల వ్యాప్తిలో నున్నవి. కావున కొంతమంది కవులు వీని ననుసరించిరి. ఉదాహరణ మొక్కటి చూపుచున్నాను.

"చుక్కలవలె, కర్పూరపు, ముక్కలవలె నీదుకీర్తి మ్లోకములన్
క్రిక్కిఱిసి పిక్కటిల్లెను, వెక్కసముగఁ బోణుగుపాటి వేంకటమంత్రీ!"

అనుపద్యము ననుసరించి

"వెన్నెలవలె కర్పూరపు, దిన్నెలవలె నీదుకీర్తి త్రిజగములందున్
మిన్నంది వన్నె కెక్కెను, కన్నాకై మగటపల్లి కామయచంద్రా!"

అని పచ్చమెట్ట పాపయకవి తనకామయచంద్ర శతకములో వ్రాసి యున్నాడు.

## 1. సూరకవి ప్రశంస :

విద్వత్కవిభూషణులు శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రులవారు తాము రచించిన 'రాయడుశాస్త్రి యశశ్చంద్రిక' అను గ్రంథమున సూరకవినిగూర్చి యిట్లు ప్రశంసించియున్నారు.

సీ. విజయరామావనీవిభునిందుకొల్వున సుకవిత లాడించుసూత్రధారి
గంటము లేకొక్కగడెకె నూఱులు పద్యములు చెప్పెద నటన్నపోటుబంటు
కడగి తిట్టిన తిట్టు కమసాలిసుత్తిపెట్టనఁ బేరు మోసినయట్టిదిట్ట
యతిఁ గూర్చుకై పెకవితసేర్పు దెల్పునంచును జాటి కూర్చిచూపినఘనుండు

గీ. నైన సూరనఁ బెడిసపుటడిదమునకు, ముందుగసలాము సేయక పోలునొక్క
కవియయిన దానికెటనైనఁగాని యనిన నేటి నామాట చెప్పఁగా నేటి కింక.

ఈపద్యము నేను కోరినవెంటనే వ్రాసి పంపిన శ్రీ సూర్యనారాయణ శాస్త్రులవారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. పీఠికాముద్రణము పూర్తియైనవెనుక నందుటచే నిక్కడ ప్రకటిత మైనది. సేకరణ :

శ్రీ నిడుదవోలు వేంకటరావు.

శ్రీరస్తు

# కవిసంశయవిచ్ఛేదము

## ప్రథమతరంగము



క. శ్రీమదుమాశంభులకు ర
మామురవైరులకు వాక్కమలసూతులకున్
జేమోడ్చి వినాయకపద
తామరసంబులకు నెఱఁగి తవిలినవేడ్కన్. 1

క. వాల్మీకివ్యాసులకును
గేల్మోగిడిచి నన్నపార్యుఁ గీర్తించి కవీం
ద్రు ల్మెచ్చఁ గవిత గూర్చున
కల్మషునిం దిక్కయజ్వ గణుతించి తగన్. 2

క. చినలచ్చిమంత్రితనయుని
ననఘుని మజ్జనకు భాస్కరామాత్యమణిన్
గొనియాడెద శ్లాఘాలం
ఘనజాంఘికకవనధాటి గలిగినమేటిన్. 3

క. పుడమిఁ గలరసికు లెల్లఁ బొ
గడఁ గవిజనరంజనకృతి గావించితి నే

నడిదము సూరకవీంద్రుఁడ
మృడపదపంకజరిరంసుమృదుమానసుఁడన్. 4

గీ. ఆంధ్రమర్మంబు దెలియంగ ననువుపడునె
ప్రకటసంస్కృతరచితసూత్రములచేత
నవనిఁ బాణినిఘటితసూత్రార్థసరణి
తెనుఁగుటీకలచేత సాధింప [1]నగునె. 5

క. కవిజనసంజీవనిలోఁ
దవిలినపద్ధతులు మఱి యితరలక్షణల
క్ష్యవి నిర్దిష్టగతుల్ చె
ప్పవలయు నని వేఱ యొక్కపద్ధతిచేతన్. 6

క. ప్రియ మందఁగఁ గవులు కవి
త్రయసుకవిత్వానుసరణి దప్పక కవిసం
శయవిచ్ఛేదన మనునా
హ్వయ మిడి లక్షణ మొనర్తు నార్యులు మెచ్చన్. 7

౧. లక్షణము

గీ. ఏవకారార్థ [2]సంప్రాప్తి హేత్వాకార
[3]మెనసి యందుంటఁ గొల్వారే [4]ననెడుచోట
నిడఁగ వచ్చును గొల్వారయేని యనుచు
భానుశతకోటిసంకాశ! పార్వతీశ! 8

1. వలెనె యని వి. పు. 2. సంప్రీతి పా. పు. 3. మొనసి పా. పు
4. ననెడి పా. పు.

## ప్ర యో గ ము

### [1]ఆదిపర్వము - శబ్దానుశాసనుఁడు

గీ. ఇంక [2]నెవ్వరు రక్కసు లిద్దురాత్మ
నట్లు మనుజులఁ దినకుండు [3]నదియె మనుజ
భక్షణముఁ [4]జేసితిర యేని బకునియట్ల
చత్తు రని [5]రక్కసుల కెల్ల సాటె వినఁగ. (౬. ఆ.) ౯

### అరణ్యపర్వశేషము - ఎఱ్ఱాప్రగడ

క. నా దైన యాశ్రితత్వము
నీ దగుచిత్తమునఁ [6]గలిమి నియతమ యేనిన్
సాదరఫణితుల నన్నవ
సాదితసమ్మోదుగాఁ [7]బ్రసాదింపు దయన్. (౪. ఆ) 10

### ఉద్యోగపర్వము - ఉభయకవిమిత్రుఁడు

చ. అది సభ యే ప్రియం [8]బడర నార్యులు నిల్వర యేని నార్యులే
మదిఁ దలఁపంగ వారలు సముంచితధర్మముఁ బల్కరేని న
ట్టిదియును [9]ధర్మమే తగ ఘటించిననిక్కము లేని దేనిఁ దా
బదిలపునిక్కమే యొకనెపం బిడుచొప్పగు నేని భూవరా!
(౨. ఆ.)

---

1. ఈయేడుపద్యంబులును పా. పుస్తకంబున లేవు. 2. నెన్నఁడు మ. పు. తా. పు. 3. నదియ వి. పు, నదియుం మ. పు. 4. 'చేసితిరేనియుం' అని మహాభారతతాళపత్రపుస్తకములోనను, ముద్రితపుస్తకములోనను గూడ నున్నది. 5. రాక్షసుల కెల్లఁ జాటి చెప్పె. తా. పు. రక్కసుల కెల్లఁ జాటి చెప్పె. మ. పు. 6. గల్మి పా. పు. మ. పు. 7. బ్రసాదింపఁదగున్. 8. బెనఁగ మ. పు. 9. ధర్మవే మ. పు.

### నైషధము - శ్రీనాథుఁడు

గీ. అనలసంబంధవాంఛ నీ కగునయేని
యనలసంబంధవాంఛ నా కగునె [1]సూవె
[2][చాలు సందేహవక్రభాషణము లింకఁ
దరుణచక్రాంగ! పాథఃపతంగశక్ర!] (౨. ఆ.) 12

### క వు ల ష ష్ఠ ము

చ. వయసునఁ జిన్నవాఁడ నభివంద్యుఁడ నౌదునె మీకు నంచుసం
శయ మొనరించెదేని మునిసత్తమ! కార్యములందునాగమా
ధ్యయనములందు మంత్రములయందు గరిష్ఠుఁడయేని పెద్ద ని
శ్చయ మిది వానియం దఖిలసన్నుత మైనసువిద్య గల్గుటన్.

### అ. ల క్ష ణ ము

గీ. [3]ఇడఁగ వచ్చును ల్యప్పుపై నిత్యసంధి
మాత్ర మొక్కొక్కచోటను మట్టుమీఱఁ
గొలుతు నఘు మడంపఁ గోరిందుశేఖరు
నన్నయట్లు కవిజనానుమతిని. 14

---

1. యతివ పా. పు. 2. మాతృకలోఁ బ్రథమ ద్వితీయ పాదములు మాత్రమే యున్నవి. పద్యము పూర్తిగా నున్నయెడల బాగుండు నని తలంచి తృతీయచతుర్థపాదముల నైషధమునుండి చేర్చుట యైనది. కావుననే యా పాదములు కుండలీకరణము గావింపఁబడినవి. ముందుకూడ నీచిహ్నమధ్య గ్రంథము మాతృకలో లేనిది యని యెఱుంగునది. 3. ఈపద్యమునఁ దొలి రెండుపాదములును తేటగీతి పాదములు. తరువాతి రెండుపాదములును ఆటవెలఁది పాదములు.

## ప్రయోగము

### ఉద్యోగపర్వము - [తిక్కయజ్వ]

క. ఇతఁడు [1]మదీయపురోహితుఁ
డితనికిఁ దగ నెల్లపనులు [2]నెఱిఁగించిపుడే
ధృతరాష్ట్రు కడకుఁ [3]బనిచెదఁ
జతురవచనరచన గఱపి సంప్రీతి మెయిన్. (౧. ఆ.) 15

### విరాటపర్వము - [సోమయాజి]

క. నమ్ముము [4] కైదువు మోపగు
జమ్మి వెసం బ్రాఁకి విడచి చాపము నాకం
దిమ్మనుడు సేయునది లే
కమ్ముగ్ధుం [5]డమ్మహీజ మలసత నెక్కెన్. (౪. ఆ.) 16

### రాఘవపాండవీయము -పింగళి సూరన్న

చ. విను పలుమాట లేల యలవేలుపుమూఁకలలోన నేనియు
న్వెనుకకు వీఁగఁ బాఱ కొకవీరుఁడు[6]నిల్వఁ గలండె యల్కచూ
పినకులుఁ [7]డించుకేని సమపేక్షితసంగరకేళి మై నిగు
డ్చిన[8]ఘనఘోరసాయకవిజృంభణ మన్యుల కోర్వ నెట్లగున్.
(౪. ఆ. ౭౫. ప.)

---

1. మదీయాగ్రపురోహితుఁ డితనికి నెల్ల. ము. పు. 2. నెఱుఁగించి తగన్. ము. పు. 3. బనుపుఁడు. ము. పు. 4. కైదువ వి. పు. తా. పు. 5. డామహీజ. తా. పు. 6. నైఁపఁగలాఁడె ము. పు. 7. డించుకంత. 8. బహుఘోర.

నైషధము - శ్రీనాథుఁడు

సీ. కోరి లీలాగేహకుడ్య[1]తలంబుల
వ్రాయుదు ర[2]న్నరేశ్వరుని మూర్తి
వ్రాసి కన్యాత్మగౌరవము వీసరవోవ
దర్శింతు [3]రన్యోన్యతరళదృష్టి
దర్శించి యతని కేఁ దగుదునో [4]తగనో య
నించుకించుక సంశయింతు రాత్మ
సంశయించి కరాంబుజములఁ గ్రొమ్మించుట
ద్దము లెత్తి చూతురు తమ్ముఁ దారు
గీ. రాజకన్యలు జగతి నాక్రమమునందుఁ
గందు వారల నిట్టూర్పు గాడ్పు వేఁడి
ముకురములు చారుమోహనమూర్తి యనఁగఁ
బరఁగుదమయంతిచేతి దర్పణముదక్క. (౧. ఆ.) 18

ఆముక్తమాల్యద - ఆంధ్రకవితాపితామహుఁడు

సీ. [కొంగవాల్నులుకు లంగుళులఁ బట్టుక జబ్బ
లంటఁ గుట్టెడ వెజ్జు నరయువారు
తలఁ బడ్డగుదియదెబ్బలఁ బొతమసి యిడి
యంబలి గంజిండ్ల నడుగువారు]
తమసేఁగిఁ జెప్ప లో దయ మీఱ విని చీరఁ
జించిచ్చువారి దీవించువారు
[నొలఁబడ్డ నెపమునఁ గలలేనిసిరిఁ జెప్పి
చుట్టలపై దాడివెట్టువారు

---

1. భాగంబుల ము. పు. 2. మ్మహీశ్వరుని ము. పు. 3. రనురాగతరళదృష్టి ము.పు. 4. తగనొకో యంచు నించుక సంశయింతు ము.పు. యతిభంగము.

గీ. నైనపాంథులచేతఁ గ్రందైనయూళ్ల
జాడగా నిటఁ దెచ్చి యిన్నిడ డించి
వారు నీరానఁ బోవ నౌవ్వారి మగిడి
వచ్చు నాలోన నీరూపు వచ్చె నాకు] (౬. ఆ. ౧౫. ప.)

సుభద్రాపరిణయము - వంశావళి [చేమకూర వేంకటకవి]

ఉ. ఇచ్చునెడం బదార్థ మడిగిచ్చునొ తా దయసేయఁ గా దన
న్వచ్చునొ [మించి యొక్కఁడన వచ్చినఁ దానవియిచ్చుగించియే
మిచ్చిన నిచ్చునే సరగ నెవ్వరిపై దయచేసెఁ జేసెనే
యచ్చతురాస్యుఁడుం దెలియఁ డచ్యుతశ్రీరఘునాథు
చిత్తమున్.] (౧. ఆ. ౪౦. ప.) 20

కవులవష్టము

చ. అదలిచి నిల్వ వారిఁ గని యంతకకింకరు లెవ్వరయ్య మీ
రిదె [1]జమునాజ్ఞ ద్రోచితిరి యొక్కఁడనుం డిట వచ్చినారు -
... ... ... ... ...
... ... ... ... ... 21

శుద్ధాంధ్రరామాయణము - [2]అడిదము భాస్కరుఁడు

చ. ... ... ... ... ... డాల్
నిగిడిరువైపుల న్వెడల నేటయి నీటగు వీటికోట... 22

---

1. శమనాజ్ఞ. 2. బాలభాస్కరుఁడు పా. పు. అడిదము భాస్కర కవి సూరకవి తండ్రి యనునంశము గ్రంథావతారికలోని మూఁడవపద్యమునను దరంగాంతగద్యమందును స్పష్టము. ఈ శుద్ధాంధ్రరామాయణ మెన్నటను నున్నట్లు గూడ వినలేదు.

### 3. లక్షణము

గీ. ఆంధ్రపదముమీఁద నచ్చు గూర్చిరయేనిఁ
[1]గలసి యుండు నొకెడఁ గలయకుండుఁ
గొమ్ము గల్గుహ ల్లొకఁడు దక్క నానతి
యిచ్చి రనఁగ నానతిచ్చి రనఁగ. 23

ప్రయోగము [2]

ఆదిపర్వము - వాగనుశాసనుఁడు

క. ధరణీసురవిరహిత మగు
నరణ్యదేశంబు నాకు నానతి యిం డి
త్తరుశాఖ విడువవలయును
గరము నిరోధ మగు ననినఁ గశ్యపుఁ డనియెఁ. (౨. ఆ.)

అరణ్యపర్వశేషము - శంభుదాసుఁడు

క. అనిన విని సూతసూనుఁడు
వినయంబున నిట్టు లనియె విప్రాకారం
బున వచ్చినవేల్పవు నీ
వనఘా! యెవ్వఁడవు నాకు నానతి యీవే. (౭. ఆ.) 25

ఆముక్తమాల్యద - [రాయలు]

క. దేవా! యిట్లని యానతి
యీవల దేఁ [గడుపుఁగూటి కిట రా నా డ

---

1. గలసి యుండవచ్చుఁ గలయకుండు పా. పు. 2. ఉదాహరణము. పా. పు. వి. పుస్తకమున నేమియు లేదు.

ఙ్చె వారిఁ బ్రోవ భిక్షా
జీవిక వర్ణికిని విధి సృజించెను గాదే] (౪. ఆ. ౬౭. ప.) 26

విరాటపర్వము - ఉభయకవిమిత్రుఁడు

సీ. [మఁజ్జనకుండు సన్మాన్యగౌతమగోత్ర
మహితుండు భాస్కరమంత్రితనయుఁ
డన్నమాంబాపతి యనఘులు కేతన
మల్లన సిద్ధనామాత్యవరుల
కూరిమి తమ్ముండు గుంటూరువిభుఁడు కొ
మ్మనదండనాథుండు మధురకీర్తి
విస్తరస్ఫారుఁ డాపస్తంబసూత్రప
విత్రశీలుఁడు సాంగవేదవేది
గీ. యర్థిఁ గల వచ్చి వాత్సల్య మతిశయిల్ల
నస్మదీయప్రణా[1]మంబు లాదరించి
[2]తుష్టి దీపించు కరుణార్ద్రదృష్టిఁ జూచి]
యెలమి నిట్లని యానతి యిచ్చె నాకు (౧.ఆ. గ్రంథావతారిక)

కళాపూర్ణోదయము - [పింగళి సూరన్న]

క. ఓ యనఘ ! దేవుఁడవో యో
గాయతకపిలాదిసిద్ధులందు నొకఁడవో
నీయనుభావం బద్భుత
మై యున్నది నామ మెద్ది యానతి యీవే (౨. ఆ. ౫౪. ప.)

---

1. మంబు సాదరించి. శా. పు. 2. తుష్టి దీపించి కరుణార్ద్ర].

విజయవిలాసము - [వంశావళి - చేమకూర వేంకటకవి]

ఉ. ఆనతి యిచ్చెనా యది శిలాక్షర మెవ్వనినైన [1]మెచ్చెనా
వానిఁ గృతార్థుఁ జేయుఁ[బగవాఁడయినన్ శరణంబుఁజొచ్చె
నా, యానరునేర మెంచక తనంతటివాని నొనర్చు నిచ్చెనా
యేనుఁగుగాని (పాడి?) యీడు గలరే రఘునాథనృపాల
శౌరికిన్]. 29

(౧. ఆ. ౧౭. ప.)

వ. ఇటువలెనే [2]చీకటిల్లు, చీకటియిల్లు; కొండంత, కొండయంత; ఊరకుండి, ఊరకయుండి; ఒక్కెడ, ఒక్కయెడ; ఒక్కుమ్మడి, ఒక్కయుమ్మడి; మేనత్త, మేనయత్త; కమ్మచ్చు, కమ్మయచ్చు; అని [3]యిరుదెఱంగుల ప్రయోగించునది. [4]కొమ్ము గల్గువాల్లోకఁడు దక్క ననఁగా - నిట్టూర్పు కట్టాకలి, పట్టంచు, మందాకు, ముద్దాడి, నూరంచులవాలు, యీరేడు,పోరాట- [5]ఇట్టివి [6]కొమ్ము గల్గువాల్లులు. వీనిమీఁద నచ్చు గలపి యుండును గాని కలయకుండదు. 30

లక్షణము

గీ. కర్మధారయంబు గావించుతఱి నకా
రాంత మైనయట్టి యాంధ్రపదము
సంస్కృతంబుతోడ సంధి సేయఁగవచ్చుఁ
జఱుతశశి ధరించె శివుఁ డనంగ. 31

1. (బ్రోచెనా. వి. పు. 2. వి. పుస్తకమున లేదు. 3. యిబ్బంగిని. పా. పు. వి.పు. 4. కొమ్ము గలవాల్లు దక్క ననఁగా. వి. పు. 5. ఇటువంటివి. వి. పు. పా పు. 6. కొమ్ము గలవాల్లులు. వి. పు.

## ప్రయోగము

... ... ...

క. [1]అగ్నిహోతిఁ జేసి మానవ
భుగ్నివహము మరణబాధ పొందింపుచు మూఁ
డగ్నులయందును నాలవ
యగ్నివలెన్ వెలుఁగుచున్న యమ్మునినాథున్. 32

### అరణ్యపర్వము - [శబ్దానుశాసనుఁడు]

ఉ. [నన్నును గౌఁగిలించుకొని నావదనమ్మునకున్ నిజాస్య మా
సన్నముఁ జేసి యొక్కమృదుశబ్దముఁ జేసె మనోహరంబుగా
నెన్నఁడు నట్టిశబ్దము మునీశ్వర! మున్విని యే నెఱుంగ నా]
యన్నవబ్రహ్మచారిముఖ మంబురుహోపమంబు సూడఁగన్.
(3. ఆ.)

### ఉద్యోగపర్వము - [సోమయాజి]

చ. జగముల నెల్లెడం దురితసంతమసంబు లడంపఁగోరి పా
ల్పుగఁ బరమేష్ఠి నిల్పిన వెలుంగు మహీసురు లట్టివారికిం
దగవు దలిర్ప సత్పురుషదత్తము లై తగుజీవితంబు లెం
త గుమతు లైన మార్తురె పదంపడి యాయువు శ్రీయు
నొల్లరే. (౧. ఆ.) 34

### నైషధము - శ్రీనాథుఁడు

గీ. లలన లజ్జాసరిద్దుర్గలంఘనమున
రాజహృదయంబుఁ జొచ్చినక్రమముఁ జూడఁ

---

1. ఈప్రయోగము ఆదిపర్వములోని దై యుండవచ్చును. మాతృకలు రెంటిలోను గూడ శీర్షిక లేనందునఁ గనుఁగొనుటకు వీలులేకపోయినది.

దరుణిమారంభపరికల్పితంబు లైన
వలుఁదకుచకుంభముల ప్రభావమునఁ జూవె. (౧. ఆ.) 35

ఆముక్తమాల్యద - [రాయలు]

సీ. పాథోధిజలయుక్తిఁ బ్రాఁచి పట్టినదిశా
కరుల నాఁ దగుమరకతపుఁగరులు
కరుల దొండము సిక్కఁ గబళించి మ్రింగిన
హరులనాఁ దొండమొ ప్పగుఁ దదశ్వ
హరులు దాపిన తాప లమర నేనుఁగు వోయి
నీరార్పు నపరంజి నీటివ్రాఁత
శ్రీలు దత్పార్శ్వ చిత్రితశంఖ చక్రముల్
రత్నంపుఁదిన్నెలఁ బ్రతిఫలింపఁ 36

గీ. బెఱపురాళి గృహశ్రీలఁ బెండ్లియాడ
[భవనరాజులు గట్టినబాసిక మనఁ
దనరు మణితోరణములతో ద్వారవితతిఁ
బరఁగువీథులు పురి సూత్రపట్టినట్లు.] (౧. ఆ. ౫౩. ప.)

కవికర్ణరసాయనము - సింగనార్ల నరసింగన్న

సీ. [వెడలి పోఁ దలఁచుచో నొడిసి కే ల్పట్టినఁ
దిరిగి నెచ్చెలిఁ జూచు దీనదృష్టి
శయ్యకుఁ దిగుచుచోఁ జనుదేక బిగ్గరఁ
జరణాంబుజము ద్రొక్కు చండితనము
బలిమిఁ గౌఁగిట గ్రుచ్చి తలిమంబుఁ జేర్చుచో
నెడఁబాటు చాలని నిడుదయూర్పు
ముంగేల వంచినమొగ మెగయించుచో
మెయిగొను నేత్రనిమీలనంబు

గీ. మాటలాడక చేకొన్న మౌనముద్ర
ఢైయొదు నివి పంచబాణుని కైదుతూపు
లయ్యెఁ బతిడెందమున గాఁడునట్టు లేయ]
నంగనామణి సరిక్రొత్తసంగమమున. (3. ఆ. ౨౧౧. ప.)

రాఘవపాండవీయము - [పింగళి] సూరన్న

మ. [అనయము] మ్రోల నేకత మహోగ్రగతిం దన చిన్ని రామచం
ద్రుని నగుమోము దామరసిరుల్ గనుపండువు గాఁ జెలంగఁ గాం
[తుఁ నరయు పాండు రాజితయశస్కుఁడు రాజవరుం డవారితా
తనువిభ వాధిరాజ్య సముదగ్ర మనోధృతియై ప్రవర్తిలన్.]38
(౨. ఆ. ౮. ప.)

పారిజాతాపహరణము - ముక్కుతిమ్మన్న

సీ. చెంద్రిక పూవన్నె జిలుగు [1]దువ్వలువను
దడి యొత్తె నొక్క కాంతాలలామ
[కొనగోళ్ల నెఱులు సిక్కులు వాపి మెలపున
శిరసార్చె నొక్క లేఁ జిగురుబోఁడి
వెన్నెలనిగ్గులు వెదచల్లెడి మడుంగు
లందిచ్చె నొక్క పూర్ణేందువదన
నవరత్నమయభూషణవ్రజంబులు మేనఁ
గీలించె నొక రాజకీరవాణి
గీ. విరులసరు లిచ్చె నొక యరవిందగంధి
యలఁదెఁ జందన మొక ధవళాయతాక్షి

1. దువ్వలువచేఁ దడియార్చె నొక్క. వి. పు.

సుదతి యొక్కతె కపురంపుసురఁటి విసరె
సిలువుటద్దంబు నొకయింతి నిలిపె నెదుట] (౨. ఆ. ౧౨. ప.)

సారంగధరచరిత్రము - [చేమకూర వెంకటకవి]

క. [వ్రతమా యిటు లేచ మధు
వ్రతమా నీ కుచితమా విరాళిం బడ నా
రత మాలించ వయో] చా
రతమూమోదయుతమా చిఱుతమారుతమా !(౨. ఆ.;40

చమత్కారమంజరి - సింహాద్రి వేంకటకవి

క. అన్నలుమోములదేవుం
డన్నాతికి లేదు మధ్య మని తెలుపుటకై
సున్న లిఖించినకైవడిఁ
గన్నియకును నాభి వింతకాంతుల నమరన్. (౨. ఆ. ౨౧. పు.)

వ. [1]ఆంధ్రభాషాభూషణకారుఁడు వేఁడిమయూఖములు, వాఁడిశరమ్ములు, తనరుమనుష్యుఁడు, పేర్చునశ్వంబు అని ఇకారోకారాంతములకే యుదాహరించినాఁడు, అకారాంతములమీఁద [కూడ] నుండవచ్చు నని [2]సిద్ధాంతీకరించుట. 42

లక్షణము

క. అగు నను క్రియతోఁ బాసియుఁ
దగు వెక్కువిభక్తులం బ్రథమ చెందును భ
క్తగణదయమానచిత్తుం
డగజాధిపుకీర్తి దిశల నల్లమె ననంగన్. 43

1. చూ. ఆంధ్రభాషాభూషణము ౧౬౮ - ౧౬౯ పద్యములు.
2. యుదాహరించుట.

## ప్రయోగము

### ఆశ్రమవాసపర్వము - తిక్కయజ్వ

క. మాతండ్రి పరాశరసుతు
చేతం బడసితి ననుజ్ఞ శీలపరత్వో
పేతుఁ డగుధర్మతనయుఁడు
ప్రీతి నొడంబడియె బంధు[1]బృందం బలరన్. (౧. ఆ.) 44

దీనిలో [పరాశరసుతుచేత ననెడి] తృతీయవిశేష్యము [మాతండ్రి యనెడి] ప్రథమవిశేషణము.

### ఆదిపర్వము - [వాగనుశాసనుఁడు]

క. నీదుకు[2]లమునకుఁ దగఁగఁ బ్ర
తోదముతో రథము గడపఁ దొడఁగుము నృపధ
[3]ర్మోదయుఁ డర్జునుతోడను
గా దనక రణంబు సేయఁగా నీ కగునే. (౬. ఆ.) 45

వ. [దీనిలో అర్జునుతోడ ననెడితృతీయవిశేష్యము నృపధర్మోదయు డనెడి ప్రథమవిశేషణము.]*

---

1. బృందయుతముగన్ ము. పు. 2. లమ్మునకుఁ దగఁ బ్ర. ము. పు.
3 ర్మోదయుఁ డగునర్జునుతో ము. పు. తా. పు.

*పా. వి. పుస్తకములలో

క. ఖలుఁ డీదుర్యోధనుఁ డె
గ్గులతోడనె యుద్భవిల్లె గోమాయురుతం
బులు సేచె దుర్నిమిత్తం
బులు పెక్కులు పుట్టె వీని పుట్టినవేళన్.

అని సభాపర్వము ద్వితీయాశ్వాసమందలి విదురధృతరాష్ట్ర సంవాద పద్య మధికముగా నున్నది.

ఉద్యోగపర్వము - [సోమయాజి]

క. మీపనుపున రాజ్యముపా
లీపాండుతనూభవులకు నీకున్న భుజా
టోపభయంకరుఁ డర్జును
కోపానల మడరి ముట్టికొనదే వారిన్. (౧. ఆ.)46

[దీనిలో అర్జును (-అర్జునునియొక్క-) అనుషష్ఠివిశేష్యము - భయంకరుఁడు అను ప్రథమవిశేషణము.

అరణ్యపర్వశేషము - శంభుదాసు

ఉ. [అగ్రజువాక్యముల్ దలఁచి యర్జునుఁ డప్పుడు వారితోడ న
త్యుగ్రత దక్కి యెంతయుఁ బ్రియోక్తుల నిట్లను మీకు
మాయెడన్], విగ్రహమేల నెయ్యమున [1]విడ్వుఁడు గౌరవ
రాజుఁ బార్థివ, ప్రాగ్రసరుండు [2]ధర్మజునిపంపిది మీకు
నలంఘ్య మిత్తఱిన్. (౫. ఆ.) 47

[దీనిలో ధర్మజుని యనుషష్ఠివిశేష్యము - ప్రాగ్రసరుండు అను ప్రథమవిశేషణము.]

నైషధము - [శ్రీనాథుఁడు]

శా. భారద్వాజపవిత్ర[3]గోత్రు విమలాపస్తంబసత్సూత్రు వి
ద్యారాజీవభవుండు మారయకుఁ బుణ్యాచార భీమాంబకున్
గారామైన తనూజు నన్నఘు శ్రీనాథా[4]ఖ్యుఁ బిల్పించి స
త్కారం బొప్పఁగ గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢి
ధీమన్. (౧. ఆ.)48

---

1. వీఁడుఁడు. మూ. పా. 2. ధర్మసుతుపంపు తా. ప. మూ. ప.
3. గోత్రుని శుభాపస్తంబ. మూ. ప. 4. ఖ్యునిం బిల్చి స - త్కా. మూ. ప.

[దీనిలో మారయకు అనుషష్ఠి విశేష్యము - భవుండు అను ప్రథమ విశేషణము.]

మనుచరిత్రము - [పెద్దనార్యుఁడు]

మ. అకలంకౌషధసత్త్వముం దెలియ మాయాద్వారకావంతి కా
శి కురుక్షేత్ర గయాప్రయాగముల నే సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహ వాహరిపు ఖడ్గవ్యాఘ్రి మిమ్మంచుఁగొం
డకు రాఁజెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రి
యుల్. (౨. ఆ. ౧౫. ప.) 49

[దీనిలో ఇమ్మంచుఁగొండకు అను షష్ఠి విశేష్యము. వ్యాఘ్రిము ప్రథమవిశేషణము.]

లక్షణము

క. తోడిగి యని పల్కుచోటను
దోడి యని సత్కవివరుల్ గృతులఁ జెప్పనగున్
మృదుఁడు మెయిఁ బాపతోడవులు
[1]తోడి యెంతయు వింతకాంతితో నొప్పె ననన్. 50

[2] ప్రయోగము

ఆదిపర్వము - [నన్నయభట్టు]

చ. పొలుపుగఁ బూసి కట్టి తోడి భూరివిభూతి ప్రకాశితంబుగాఁ
గలయఁగఁ దత్పురిజనులు కాంస్య[3]మందంగ - శంఖభేరికా
హాళ[4]పటహాధ్వనుల్ సెలఁగ [5]నాటలుఁ బాటలు నొప్ప

---

1. తోడి మిక్కిలివింత పా. పు. 2. ఉదాహరణము. వి. పు. పా. పుస్తకమున నేమియు లేదు. 3. మృదంగము లంద మొప్పఁగా. వి. పు. మృదంగము లంద మొందఁగా పా. పు. మృదంగనినాద మొప్పఁగా. తా. పు. 4. కటక. పా. పు. వి. పు. 5. నాటలఁ బాటల నొప్పి రెల్లవా. పా. పు. వి. పు.

నెల్లవా, రలుఁ జని చేసి రర్చనలు రైవతకాద్రికి [1] నుత్స
వంబుతోన్. (౮. ఆ.)

విరాటపర్వము - [తిక్కయజ్వ]

క. తదవసరంబున నొక్కటఁ
బదియమ్ములు దొడి త్రిగర్తపతిపక్షంబుౘ
[2]వదనంబు నేసి విరటుఁడు
మదమునఁ దురగముల నేసె మఱియుఁ బదింటన్. (3. ఆ.)

మనుచరిత్రము - [పెద్దనార్యుఁడు]

చ. తళుకుదుకూలశాటి కటిఁ దాల్చి పటీర మలంది హారకుం
డలమణిపారిహార్యరశనాకటకాంగుళి[3]ముద్రికాదిభూ
షలు దొడి పారిజాతవికసత్ప్రసవావళిఁ [4]బూని యొయ్య న
వ్వేలఁది వివాహవేది కలి[5]వేణులు దేఁ జనుదెంచె వేడుకౘ.
(౨ ఆ. ౮3. ప.) 53

రామాయణము - హుళిక్కిభాస్కరుఁడు.

చ. నిరతము గాఁగ వింటఁ దొడి [6]నిండుదెగ న్వడి నేయ నస్త్ర
హో,[7]శరమును మాఱు నేయు శరశక్తి గదాదులఁ [8]ద్రుంచు
చుౘ భయంకరగతిఁ బాఱి రక్కసునికంఠము ద్రుంచెను
మేరుశృంగముల్, దొరయు పసిండి [9]బొమ్మికము [10]తోడి
శిరంబు వసుంధరం బడౘ. (యుద్ధకాండము.) 54

---

1. నుత్సవంబునౘ. తా. పు. వి. పు. 2. విదళనము చేసి తా. పు.
3. ముద్రికావిభూ. వి. పు. పాపు. 4. బూని యొప్పె న పా. పు.
5. వేణులతోఁ జనుదెంచె. పా. పు. 6. నిండువడిం దెగనేయు. పా. పు.
7. శరమెదమాయెనే యిషుశక్తి? ము. పు. 8. గాల్చుచుౘ ము. పు.
9. బొమ్మికము. వి. పు. 10. తోటి. పా. పు. వి. పు.

ఊరడిలి యన్నందుకు ఊరడి, తెప్పిరిలి యన్నందుకు తెప్పిరి - ఇటువలె ప్రయోగములు గలవు.

లక్షణము

గీ. జగ మనెడురూపమున జగచ్ఛబ్ద మడరుఁ
దత్సమముఁ జేసిరేని సత్కవిజనములు
జగతిఁ దేజోయశ స్తపశ్శబ్దములకుఁ
దేజము యశము తప మన్న యోజ శర్వ! 55

ప్రయోగము

ఆదిపర్వము [నన్నయభట్టు]

చ. ఫలపవనాంబుభోజనశుభవ్రత[1]తృప్తులఁ జేసి చూడ దు
ర్బలతను లయ్యు బ్రాహ్మణు లపారతపోబలసంపద న్మహా
బలయుతు [2]లట్టివారలకు భవ్యుల [3]కెందు నసాధ్య [4]మెద్ది
యుం, గలదె చరాచరాఖిలజగంబులఁ [5]బెద్దలు గారె
[6]చూడఁగన్. (౭. ఆ.) 56

అనుశాసనికపర్వము [తిక్కన సోమయాజి]

చ. అజుని యనుగ్రహంబున విహంగమవల్లభుఁ డట్లు చాల న
క్కజ మగుశౌర్యసంపద ప్రకాశత [7]నొందఁగఁ గేలి సల్పియుం
ద్రజయమహోత్సవంబున సుదాత్తయశఃపరిపూరితంబులై
[8]త్రిజగములున్ వెలుంగ [9]నలిఁ దెచ్చె సుధారసపూర్ణ
[10]కుంభమున్. (౧. ఆ). 57

1. వృత్తుల. ము. పు. తా. పు. 2. లిట్టివార. తా. పు. 3. కెన్న. పా. పు. వి. పు. 4. మెందుఁన్ పా. పు. వి. పు. 5. పెద్దలకారె. వి. పు. తా. పు. 6. సద్ద్విజుల్ తా. పు. వి. పు. 7. బొందఁగ ము. పు. 8. త్రిజగ ములన్ వి పు. 9. వెసఁ ము. పు. 10. భాండమున్. ము. పు.

నైషధము - శ్రీనాథుఁడు

ఉ. [అద్దివిజాధినాయకుని యానతి సేయఁము చిత్తవృత్తి నొం
డెద్దియునుం దలంపకు మహీనపరాక్రమనీతిశాలి నీ]
ముద్దుమఱందికుఱ్ఱ హరిమోసలఁ గార్యభరంబు దీర్పఁగా
గద్దియమీఁద నుండి త్రిజగంబుల నేలికొనంగ నొల్లదే. 58
(౩. ఆ.)

విజయవిలాసము - [చేమకూర వేంకటకవి]

చ. [అని మది మెచ్చి యొచ్చె మొకయందున లేనిమనోహరాంగ
ముల్గనుఁగొని [1]యానె కా వ్రతము గైకొని యుండెడు
నన్ను నేల దోడ్కొని కొనితెచ్చె నీ వెడగుఁగోమలి] భూజగ
మేడ మారుతా, శనజగ మేడ యెంత ఘనసాహస మింతుల
కంచు నెంచుచున్. (౧. ఆ.) 59

ఆముక్తమాల్యద - [రాయలు]

ఉ. [పూని ముకుందునాజ్ఞఁ గనుబొమ్మనె కాంచి యజాండభాండ
ముల్, వానను మీఁదఁ బోవ నడవ న్గానెఁ దన్నున నగ్ర
నిశ్చల, శ్వానుచలత్వనిష్ఠలై] సమస్తజగంబుల జాడ్యచేత
నల్,గా నుతి కెక్కుసైన్యపతి కాంచనవేత్రము నాశ్ర
యించెదన్. (౧. ఆ.) 60

౪. లక్షణము

గీ. కొనని యనుపల్కునకును జేకుఱును బూర్వ
వర్ణదీర్ఘంబు మధ్యమవర్ణలోప

1. మానికావ్రతము. ము. పు.

మలరు చావక పోవ కళాపలుకులకును
మధ్యమాత్రలోపంబు మదనమథన! 61

ప్ర యో గ ము

నైషధము - శ్రీనాథుఁడు

గీ. వానిఁ గలలోనఁ గాననివనజముఖియు
వాని మార్పడఁ బేర్కొననిమానవతియు
వానిఁగా నాత్మ భావించి వరునిఁ గవయ
నప్పళింపనిసతియు లేదయ్యె నచట. (౧. ఆ.) 62

అందుననె.

మ. ధరణిం బొందనికోమలాంఘ్రి కమలద్వంద్వంబులుం ఘర్మశీ
కరసిక్తంబులు గానిభాలములు పక్ష[1] శ్రేణులం బత్రకే
సరము ల్గందనిపూవుదండలు నిమేషత్వంబు గైకోనిదృ
క్సరసీజంబులు నల్వు రందుఁ గనియెం గాంతాలలామంబొగిన్.
(౫. ఆ.) 63

ల క్ష ణ ము

ఇయ్యని యనుచోట నిటులనే యీని యని రూపము వచ్చును.

ప్ర యో గ ము

రామాయణము - ఎఱ్ఱాప్రగడ

దాన మిచ్చితి నని యీనిదీనుభంగి.

ల క్ష ణ ము

చావక పోవక యనుటకు చాక పోక యని రూపములు వచ్చును.

ప్రయోగము

ఉద్యోగపర్వము - తిక్కన సోమయాజి

స్రగ్ధర.
గాండీవజ్యారవం బుత్కట మఱి పెలుచం [1]గప్పినం భీము
బాహా, దండం[2]బం దొప్పశుంభద్గద జడియుచు రౌద్రం
బుగాఁ దోఁచినన్ వే, దండద్వంద్వంబుమాడ్కిం దఱిమి కవలు
మాద్యద్గతిం దాఁకినం జా, కుండం బోకుండఁ గౌరవ్యులకు
వశమె [3]బిట్టార్చి మూర్ఛిల్లకుండన్. (౧. ఆ.) 64

౫. లక్షణము

గీ. క్షితిని నుత్తమపురుషంబు సెప్పుచోట
నందమై యుండకుండు మార్కొందు ననఁగ
నుండు మార్తుర నేన (?) మార్కొందు ననఁగ
భుజగకేయూర! కాశికాపురవిహార! 65

ప్రయోగము

ఉద్యోగపర్వము - తిక్కన సోమయాజి

ఉ. ఎండకు వాన కోర్చి తనయిల్లుఁ బ్రవాసపుఁజోట నాక నా
కొండు నలంగుదు న్నిదురకుం దఱి దప్పెదు దప్పి పుట్టె నా
కండను నెట్లొకో యనక కార్యము వచ్చినచోట నేలినా
తం డొకచాయ చూపినను దత్పరతం బని సేయు టొప్పగున్.
(౧. ఆ.) 66

1. గ్రమ్మినన్. 2. బేపారి. 3. బిట్టుల్కి.

సౌప్తికపర్వము - తిక్కన సోమయాజి

క. పాండవులం బాంచాలురఁ
జండభుజావిభవ [1]మొప్ప సమయించి కృతా
ర్థుండ నయి [2]పేరుఁ బెంపుం
[3]గండు న్నే నొండు లేక కార్యము దలఁపన్. (౧. ఆ.) 67

మౌసలపర్వము - తిక్కన సోమయాజి

సీ. [అబ్జాంగిఁ గృతకృత్యుఁ డైనయప్పార్థుండు
యాదవపురమున కరుగుచున్న
యెడ ననుచరులతో నిట్టికార్యంబును
నడపక తక్కిన నాథు చన్న
గతికిఁ బోవుటకునై కడఁగి రుక్మిణీ
ప్రభృతుల మనకు నిల్వంగ వశమె
రే యెల్ల నిప్పని సేయువిధముల క
ప్రియ మగునంతకుఁ బేర్చునబ్ధి
గీ. మేలు సేయఁ బోయి యీలోక మంతయుఁ
దిట్టునట్టికీడు దెచ్చికొనఁగ]
వచ్చునే స్వదేశవర్తుల మై చూచి
కొండ మెల్లపనులు రండు వేగ. 68

ఉండు రనుటకు ఉండ్రు - అందు రనుటకు అండ్రు - కొందు రనుటకు కొండ్రు - మందు రనుటకు మండ్రు - విందు రనుటకు విండ్రు.

---

1. మెసఁగ. 2. పెంపుఁ దేజము. 3. గండును దక్కొండు లేక కార్యము దలఁపక; గండును నొక్కండు లేడు కార్యము నడపక.

౧౦. ల క్ష ణ ము

గీ. ఒగి హాలంతంబు లొకకొన్ని యూఁదుచోటఁ
దేల్చి పలుకంగ వచ్చును దెల్లముగను
జేసెను సపర్య లొగి నింద్రజితుని తండ్రి
యబ్జరేఖావతంసున కన్నయట్లు. 69

ప్ర యో గ ము

ఆదిపర్వము - నన్నయభట్టు

చ. అనుపమితప్రభావు యజనాభిరతుఁ భరతాన్వవాయవ
ర్ధను సకలప్రజాహితవిధాను ధనంజయసన్నిభుఁ భవ
జ్జనకుఁ బరీక్షితుఁ భుజగశాలుఁ డసహ్యవిషోగ్రధూమకే
తనహతిఁజేసి చేసె నతివాంతకృతాంతనికేతనాతిథిన్.
(౧. ఆ.) 70

అందుననే.

క. సుతు లనఘులు వేవురు దమ
యుతులై యుదయించి సాంఖ్యయోగాభ్యాసో
న్నతిఁజేసి ముక్తులై భూ
రితేజు లందఱును నూర్ధ్వరేతసు లైనన్. (3. ఆ.) 71

అందుననే.

క. మరుతుల యంశంబునఁ బు
ట్టితి యుధ్ధ్వరు విविధరణపటిష్ఠబలులు సు
స్థిరయశులు ద్రుపదసాత్యకి
విరాటభూపతులు భువనవిశ్రుతకీర్తుల్. (3. ఆ.) 72

అందుననె.

క. ఆకచుఁ డత్యంతవిషా
దాకులుఁ డై లోకనింద యగునర్థము నీ
వాకునకుఁ దెచ్చు టుచితమె
నాకు సహోదరివి తలఁప నాచిత్తమునన్. (3. ఆ.) 73

నైషధము - శ్రీనాథుఁడు

మ. కమలేందీవరషండమండితలసత్కాసారసేవారతిన్
గమికర్మీకృతనైకనీవృతుఁడ నై కంటిన్ విదర్భంబునన్
[రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమపీనస్తని నస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్.] 74
(౨. ఆ.)

నైషధము - శ్రీనాథుఁడు

సీ. [నలినసంభవు వాహనము వారువంబులు
కులముసాములు మాకుఁ గువలయాక్షి
చదలేటి బంగారు జలరుహంబులతూండ్లు
భోజనంబులు మాకుఁ బువ్వుబోఁణి
సత్యలోకముదాఁక సకలలోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరము లైనమామాటలు వినంగ
నమృతాంధసులు యోగ్యు లనుపమాంగి
గీ. [భారతీదేవి ముంజేతిపలుకుఁ జిలుక
సమదగజయాన సద్బ్రహ్మచారి ప[illegible]ఁగ
వేదశాస్త్రపురాణాదివిద్య లెల్లఁ
దరుణి! నీయాన ఘంటాపథంబు మాకు.]

రాఘవపాండవీయము - పింగళి సూరన్న

గీ. ఎందు వేఁట రారె యితరు లేమనసుతో
దారసంగసుఖముఁ దప్పఁ ద్రోచి
తకట! పాండురాజయశ మెన్నవై తతి
క్రూరదశరథేశకులము రోయ. (౧. ఆ.)76

విజయవిలాసము - వేంకటకవి

గీ. తామ్రపర్ణీనదీతీరధరణి నేలు
దొరతనము దెల్ప రాశిగా నెఱయఁ బోయు
[1]ముత్తియంబుల తలఁబ్రాలు ముదితచేత
ముదితచేతస్కులై సభాసదులు పొగడ. (౨. ఆ.)77

౧౧. లక్షణము

క. ఒక్కకవి లే దటంచును
వక్కాణించుటను జెప్పవలసెను నాకుఁ
డక్కను దక్క ననంగను
దక్కెను జయలక్ష్మి పురవిదారి కనంగన్. 78

ప్రయోగము

ద్రోణపర్వము - తిక్కనసోమయాజి

ఉ. ఒక్కఁడు సన్నవాఁడు విజయుండు మహీరజ మెక్కు డయ్యె
న్నద్దిక్కునఁ బాంచజన్యము యుదీర్ణత మ్రోయఁదొడంగె
నక్కటా!, చిక్కనో కౌరవాధములచేత నతం డిట నీ వొకం
డవుం, దక్క నొరుండు దీర్పఁగ నుదగ్రుఁడు బంధుఁడు
లేమి వేఁడెదన్. (3. ఆ.) 79

1. ముదితచేతుల తలఁబ్రాలు ముత్తియములు.

అరణ్యపర్వము - నన్నయభట్టు

మత్తకోకిల.

దేవమూర్తులు పాండుపుత్త్రులు ధీరచిత్తులు వారిపెం
పీ వెలుంగనివాఁడవే ధరణీశ! వాయుసుతుండు గాం
డీవియుఁ భుజవిక్రమప్రకటీకృతు ల్వివిధాస్త్రవి
ద్యావిశేషులు వైరివీరులఁ దక్క నిత్తురె పోరులన్. (౧.ఆ.)

అరణ్యపర్వశేషము - శంభుదాసు

క. ఎక్కడి రాఘవుఁ డక్కట!
తక్కువ యగు పేదమనుజుఁ దగిలి వనములం
బెక్కిడుములఁ బడఁ దగునే
దక్కుము మది నింక నొండుతలఁపులు దరుణీ! (౬. ఆ.) 81

డగ్గఱ - దగ్గఱ ; డప్పి - దప్పి ; డిగి - దిగి ; డెప్పరము - దెప్పరము - ఈలాగు నుభయపద్ధతులఁ బ్రయోగములు గలవు.

౧౨. ల క్ష ణ ము

గీ. నాటఁగా యనుచోటను నాడఁగా య
నంగఁ జెల్లును సుకవిజనంబులకును
గ్రీడి నారసములు నాడ మాయభిల్లుఁ
డించుకేనియు మదిని జలించఁ డనఁగ. 82

ప్ర యో గ ము

ద్రోణపర్వము - తిక్కన సోమయాజి

క. తోడన హయసూతులనో
గాడఁగ నేయుటయు నతఁడు గనలి ఘనపవి

క్రీడయపోలెం గొని మై
నాడఁగ నిగుడించెఁ ద్రిదశనారాచములన్. 83

౧౩. లక్షణము

తే. ఎన్న జాత్యేకవచనము ల్గొన్ని గలవు
వానిపద్ధతు లెఱుఁగంగవలయుఁ గవులు. 84

ఆ. వారుని నృత్తకేళి యత్తఱి చూచిరి
యఖిలదివిజవర్య లన్నయట్లు. 85

ప్రయోగము

శాంతిపర్వము - తిక్కన సోమయాజి

ఉ. [దుర్జయవిక్రమోజ్జ్వలుఁడు దోషవివర్జితబుద్ధి కార్తవీ
ర్యార్జునుఁ డేడుదీవులు నయాన్వితశూరత నేలుచుండు ధ
ర్మార్జనలోలబుద్ధియు మహాస్త్రబలంబు సహస్రబాహుతా
స్ఫూర్జనము న్వెలుంగఁగ నృపుల్ దనయాజ్ఞఁ దలన్వహిం
పఁగన్. (౨. ఆ.) 86

నైషధము - శ్రీనాథుఁడు

సీ. [భక్తిఁ బ్రదక్షిణప్రక్రమంబులఁ జేసి
రాశుశుక్షణి కీ నుపాసనంబు
నంశుక గ్రంథి కల్యాణక్రియాచార
మాచరించిరి మందహాస మెసఁగ
నత్తఱి చూచిరి యాకాశమండలా
స్థానసంవాసి నౌత్తానపాదిఁ
[త్రైలోక్యపతి దేవతాఫాలతిలకంబు
దివిరి యరుంధతీదేవిఁ గనిరి

గీ. బ్రాహ్మణోత్తమ పుణ్యపురంధ్రివర్గ
మంగళాశీర్వచోయుక్తమహిమశోభ
నాక్షతారోపణంబుల నాదరించి
రంబుజాక్షియు నిషధదేశాధిపతియు. (౬. ఆ.) 87

విజయవిలాసము - చేమకూర వేంకటకవి

గీ. [అనినఁ బవనుండు మనకు లో నైనవాఁడు
తోయజారాతి మనుజుల త్రోవ రాఁడు]
కాముతూఁపులు వెంట్రుకఁ గట్టుపడును
[చామ! యూరక యేటికి జలదరింప] (3. ఆ.) 88

మేఘసందేశము - కాళిదాసు

శ్లో. హస్తే లీలాకమల మలకే బాలకుందానువిద్ధం
నీతాలోధ్రప్రసవరజసా పాండుతా మాననే శ్రీః
చూడాపాశే నవకురవకం చారుకర్ణే శిరీషం
సీమన్తే చ త్వదుపగమజం యత్ర నీపం వధూనామ్. 89

౧౪. లక్షణము

గీ. తెలియ భూతార్థగోచరదేవమాన
వక్రియాపదములు బహువచనయుక్తి
గలసి వర్తిల్లు నచ్చులు గలయకుండు
హారునకై కేలు మోడ్చిరి యమరు లనఁగ. 90

ప్రయోగము

ఆదిపర్వము - నన్నయభట్టు

సీ. [వినవయ్య! కృతవీర్యుఁ డనుజనపతి తొల్లి
భృగువంశ్యయాజ్యుఁడై పెక్కుక్రతువు

లోనరించి యగణితధనదానముల వారిఁ
దృప్తులఁ గావించి దివికిఁ జనిన
నతనివంశమువార లతిధనలుబ్ధులై
కృతవీర్య[1]నర్థంబు గిలుబుచేసి
కొని డాఁచియున్నవా రని భార్గవుల నెల్లఁ
బలికిన భార్గవుల్ భయముఁ బొంది]
గీ. కొంద ఱర్థముల్ వారికిఁ [2]గూర్చి యిచ్చి
రవనిసురులకు నిచ్చిరి యందుఁ గొంద
[3]ఱెవ్వరికి నీయ కటు తమయిండ్లఁ బాతి
కొని సుఖం బుండి రథములై కొంద ఱందు. (2. ఆ.) 91

మ. గురుభీష్మాదులు సూచుచుండ సభ మీఁకుం గీడు నాఁ డట్ల
ముష్కరులై చేసిరి యంత చేసియును బశ్చాత్తాపముం
బొంద నోపరు వా రెన్నఁడు నట్టిచోటఁ గృపయుం బంధు
త్వముం దక్కఁ మెవ్వరు గోపింపరె యాదురాత్మకుల గర్వ
క్రౌర్యము లూహించినన్. (3. ఆ.) 92

నైషధము - శ్రీనాథుఁడు

మ. బలభిద్వహ్నిపరేతరాజవరుణు ల్పర్యుత్సుకత్వంబునం
దిలఁ గూర్చుండిరి యొండొరుం గదిసి యర్థిం దత్ప్రదేశంబున
[న్నలనాళీకమృణాళనాళలతికానవ్యప్రణాళీమిళ
ల్లలనాలాపకథాసుధానుభవలీలాలోలచేతస్కులై.]
(3. ఆ.) 93

1. ధన మెల్లఁ గృత్తుచేసి. 2. గూడ నిచ్చి 3. ఱెవ్వరికి నీక తమ తమయిండ్లఁ బాతి; ఱెవ్వరికి నీక తమయిండ్లయొద్దఁ బాతి? యతిభంగము.

లక్షణము

తే. పరఁగ లోకమునం దని పలుకుచోట
లోకమునయం దనఁగవచ్చుఁ బ్రాకటముగ. 94

ఆ. వినుతి కెక్కె లోకమునయందుఁ జంద్రరే
ఖావతంసుకీర్తి యన్నయట్లు. 95

ప్రయోగము

అరణ్యపర్వశేషము - శంభుదాసుఁడు.

చ. ఉరమునయందుఁ గన్నులు పృథూదరదేశమునందు నోరుఁ బ్ర
స్ఫురితభుజద్వయంబు గలభూమిధరోన్నత భావముం గరం
బరుదుగ నుగ్రమైనవికృతాకృతితోడ నశేషసత్వఘ
స్మరుఁ డగుచున్నవానిఁ బటుసత్త్వుఁ గబంధునిఁ గాంచి
రచ్చటన్. (౬. ఆ.) 96

నైషధము - శ్రీనాథుఁడు

మ. ఒకరత్నంబు విదర్భదేశములయం దుద్భూతమై పార్థివ
ప్రకరంబుం భ్రమియింపుచున్నయది సౌభాగ్యప్రభానిత్యల
క్ష్మికి సంకేతనివాసమై మదననిస్త్రింశంబు నాభీమక
న్యక నాఁగా దమయంతి నాఁ గలుగుపర్యాయాభిధానంబు
లన్. (3. ఆ.) 97

లక్షణము

గీ. కర్మధారయంబు గావించుచోటను
నూఁది పలుకవచ్చు నొక్కచోట
స్ఫుటకృపావిభూతిఁ బొలుచుశివుఁడు మాకు
నభిమతార్థ మిచ్చు నన్నయట్లు. 98

ప్ర యో గ ము

కవులషష్ఠము (?)

శా. శ్రీరామామణి సీత సాథుని యురస్సీమ న్నిజచ్ఛాయఁ గ
న్నారం గన్గొని యాత్మ నన్యవనితేర్ష్యం బూనఁ దత్కాం
ధరణ్, హారం బున్పుచు నింకఁ జూడు మనఁ దా నౌటం
ద్రపం జెందఁ జె, ల్వారు న్రాముఁడు ప్రోచుఁ గాత చికతిమ్మా
ధీశు తిమ్మాధిపున్. 99

ల క్ష ణ ము

గీ. ప్రతిఘటించె ననెడుపట్టునఁ బ్రతిఘటి
యించె ననఁగఁ జెల్లు నెల్లిదముగ
భానుకోటితోన ప్రతిఘటియించెను
హారుని దివ్యతేజ మన్నయట్టు. 100

ప్ర యో గ ము

నైషధము - శ్రీనాథుఁడు

క. ఆరయ నీ[1] తేజమునకుఁ
గారణ మగు నేకులంబొ గాంభీర్యమునం
దారాపతి గన్నపయః
పారావారంబుతోడఁ బ్రతిఘటియించెన్. (౪. ఆ.) 101

ఆంధ్రభాషాభూషణకారుఁడు సమస్తలఘుద్వ్యక్షరముల మీఁదఁ గాని వికల్పము పుట్టదన్నాఁడు. చతురక్షరములమీఁద (కూడ)నుండవచ్చును.

---

1. యుందయమునకు.

లక్షణము

గీ. పరఁగ సంతోషశబ్దతద్భవము సేయఁ
జనును సంతోషమును సంతసం బటంచు
నిరుదెఱంగులఁ బలుకంగ నెల్ల కృతుల
భుజగకేయూర! కాశికాపురవిహార! 102

ప్రయోగము

ద్రోణపర్వము - తిక్కనసోమయాజి

క. నీసైనికు లెంతయు సం
తోసిల్లుచు నార్చి రపుడు దుఃఖితులై కుం
తీసుతుల వారు దీనద
శాసంగతులైరి బాష్పజలములు దొరుగన్. (౨. ఆ.)103

లక్షణము

క. పెనచికొని కూడుకొని యిడి
కొని యనుశబ్దములఁ గృతులఁ గూరుచువేళం
గొనిశబ్దపూర్వవర్ణం
బున కిత్వోత్వములు వచ్చు భుజగవిభూషా! 104

ప్రయోగము

కర్ణపర్వము - సోమయాజి

ఇత్వము వచ్చినందుకు -

చ. వికలతరప్రయత్న పృథివీపతిఁ గన్గొని ద్రోణపుత్రక
ర్ణకృపులు తక్కనుం గలుగునాయకులున్ రయమారవచ్చి
క్రాడికొనినఁ జూచి యంతయు వడిం జనుదెంచిరి ధర్మసూను
పొం,తకు సముదగ్రులై యతనితమ్ములు సంగరకౌతు
కంబునన్. (౧. ఆ.) 105

ఆముక్తమాల్యద - రాయలు

ఉత్స్వము వచ్చినందుకు -

చ. ఒకమఱి బుడ్డగింప విలయోదకము ల్పయి కుబ్బి చిప్ప వ
చ్చుకొని మహాభ్రవీథిఁ జన సూకరత న్మయి వంచి వెండి క్రిం
దికిఁ గయి వ్రాలు తత్సలిలనిర్మలధార సతఃపరస్ఫుర
త్ప్రకృతికి నీయజాండమును బంగరుముంగరగా నొనర్పవే.
(౭. ఆ. ౨౧. ప.) 106

లక్షణము

క. జడపదబహువచనములకు
నిడఁదగును విశేషణముల నేకవచనము
ల్మృతుని ఘనకీర్తులు బెడం
గడరెం దట్ట మయి దిశల నన్నివిధముగన్. 107

ప్రయోగము

ఆదిపర్వము - నన్నయభట్టు

మాలిని. సురపతిసభఁ జూడం జూడ నంగారవృష్టు
ల్గురిసెఁ గులిశధార ల్కుంఠితం బయ్యె దిక్కుం
జరమదము లడంగెన్ సర్వదిక్పాలకాంతః
కరణములు భయోద్వేగంబున న్సంచలించెన్. (౨. ఆ.)

ఆముక్తమాల్యద - రాయలు

శా. ప్రాతర్వేళల నట్టివెట్ట సొగసై పాటిల్లెఁ గుంభోంభనో
ద్భూతాంబుధ్వని వాద్యమై మరుదథఃపుంజీభవత్పాటల
వ్రాతామ్రేడితసిక్తభూసురభిళారామంబు కుల్యాబహు
స్రోతస్సంధుల నంధుయంత్ర నతికృతోప్రోద్గీతగేయౌఘముల్.
(౨. ఆ. ౭౬ ప.) 109

లక్షణము

క. నిలువుము కొలువుము పిలువుము
గెలువుము విడువు మనఁగాఁ దగిన బహుళశబ్దం
బులకుం దృతీయవర్ణము
తొలఁగిన దోషంబు లేదు తుహినాంశుధరా!. 110

ప్రయోగము

విరాటపర్వము - సోమయాజి

ఉ. బుద్ధులు సెప్పు టెల్ల నటు పోవిడు మెమ్మెయి నైన సౌఖ్యసం
సిద్ధి యొనర్పు నాకు నెడఁజేసినఁ బాపము రూపు మాపు నా
వృద్ధియ కోరుదేని యవివేకివి నీ వని నన్ను నిట్లసం
బద్ధము లైనవాక్యములు పల్కక వే పిలిపింపు కోమలిన్.
(౨. ఆ.) 111

లక్షణము

క. ఏయన నైన ననుట యా
నైయనఁ గలిగి యనునర్థ మలవడి యుండున్
జేయఁగ ననియెడిచోటను
జేయు డని వచింపఁజెల్లు శేషవిభూషా! 112

ప్రయోగము

ఏ యనుటకు -

నైషధము - శ్రీనాథుఁడు

ఉ. [హాలహాలద్వయంబు గలశాంబుధిఁ బుట్టె వినీలపాండుర
జ్వాలలతోడ నం దొకవిషం బొకవేలుపు మ్రింగె] నెందఱే
వేలుపు లోలిమై ననుభవించిన [రెండవ యీవిషంబు ని

ర్మాలము గాక యున్నయది ముద్దియ! పాంథులపాప
మెట్టిదో.] (ద్వి. ఆ.) 113

ఎందతే యనఁగా ఎందతైన ననుట -
ఐ యనిన కలిగి యనునర్థము వచ్చినందుకు -

ద్రోణపర్వము - సోమయాజి

సీ. [అర్థి విశ్వావసుఁ డాదిగాఁ గలుగుగం
 ధర్వులు హృద్యవాదన మొనర్ప]
నప్సరోగణములు నాటలు పాటలు
 నై వినోదింపంగ [నమరగణము
బహువిధాలంకారభంగుల విన్నాణ
 ములు సూప దివ్యమునులు నుతింప
మనుజలోకం బెల్లఁ గనకాస్త్ర భూషణ
 దానములను దృప్తి సనఁగ నశ్వ ?
గీ. మేధసమితి చేసి మెప్పించె నింద్రుని
శతతమాధ్వరముల నతఁడు హయము
నాసపడిన నిచ్చె నాదిలీపునిఁ జూపు
మా ధరిత్రి నిపుడు మనుజనాథ!] (ద్వి. ఆ.) 114
 నేయు డనుటకు -

భీష్మపర్వము - సోమయాజి

క. ఆపన్నిద్ధలు సైన్యా
టోపసమేతు లయి కదియుదురు [పాంచాల
క్ష్మాపాలసుతుఁడు భీముఁడు
నేపారిరి నీదుసేన యొసకం బడఁగన్.] (ద్వి. ఆ.) 115

గవియు డనఁగా గదియఁగా ననుట -

లక్షణము

గీ. వర్తమానార్థఘటనచే వఱలు కర్మ
ధారయపుటుత్వమున నచ్చు దగిలెనేని
యగు ధ్రువంబుగ నత్వ మేలతఁ డనంగఁ
జెల్ల దేలునతం డనఁ జెల్లు శర్వ! 116

వర్తమానార్థమును జెప్పని కర్మధారయములకు నచ్చుపై నుండ నకారప్రాప్తి లేదు. ఎటుల నంటే నూరంచులవాలు, పెక్కునుంగులు, యీరేడు జగంబులు - పట్టంచులదుప్పటి, మందాకు - ఇత్యాది.

లక్షణము

గీ. షష్ఠిమీఁద నచ్చు సంధి చేసిరయేని
యొదవుఁ బాయు నత్వ మొక్కవేళ
నాకు నానతిచ్చె నా కానతిచ్చె న
నంగ విగతరోష! నాగభూష! 117

లక్షణము

క. నాంతక్రియాపదంబుల
పొంతల నచ్చున్న నత్వము ధ్రువంబుగ నా
సంతత మొదవుం బాయును
చెంతల వా ల్లుండెనేని శ్రీశైలపతీ! 118

లక్షణము

గీ. పురమునందలివా రని పొసఁగఁ బలుకు
నెడఁ బురంబునవా రని యిడఁగ వచ్చు

నిట్టి వింతప్రయోగమ్ము లెఱుఁగవలయు
నాంధ్రసుకవు లహార్యకన్యాసహాయ! 119

ప్ర యో గ ము

సభాపర్వము - నన్నయభట్టు

చ. అవనితలంబు వ్రస్సెనొ హిమాచలశృంగము భిన్న
మయ్యెనో, శ్రవణవిదారణం బయిన శబ్దము దా నది యేమి
యొకొ[1]భై, రవముఁగ వీచె నంచును బురంబునవారు
భయంబు [2]వొందఁగా, నవిదలగర్భము ల్గలఁగె నుక్కుణఁ
గెఁ మగధేశసైన్యముల్. (౧. ఆ.) 120

ఆదిపర్వము - నన్నయభట్టు

గీ. తల్లి! నీకులగోత్రసౌందర్యములకుఁ
దగినపతిఁ గంటి దానికిఁ దగఁగ గర్భ
మయ్యె [3]నీదుగర్భమునవాఁ డఖిలభువన
వహనమహనీయుఁ డగుచక్రవర్తి సుమ్ము. (౪. ఆ.) 121

అందుననె -

సీ. [పలుకుల ముద్దును గలికిక్రాల్గన్నుల
తెలుపును వలుద చన్నుల బెడంగు
నలఘుకాంచీపదస్థలముల యొప్పును
లలితానసేందుమండలమురుచియు]
నళినీలకుటిలకుంతలముల కాంతియు
నెలజవ్వనంబున విలసనంబు

1. భైరవ మయి వీచె. 2. నొందఁగా. 3. నీగర్భమునవాఁడె యఖిల
భువన.

[నలసభావంబును బొలుపును మెలపును
గలుగునగ్గిరికను దలంచి తలంచి
తే. ముదితయందుఁ దనదుహృదయంబు నిలుపుటఁ
జేసి రాగ మడర భాసురముగ
రమణితో వనాంతరమున రేతస్స్యంద
మయ్యె నవనిపతికి నెయ్య మమర. (3. ఆ.) 122

అరణ్యపర్వశేషము - ఎఱ్ఱాప్రెగడ

సీ. [మృగనేత్ర! దారుణమృగసమాకుల మైన
యివ్వనాంతరమునం దేకతంబ
యిట్లున్నయునికికి నెయ్యది మూల మి
వ్వనదేవతవొ సురేశ్వరునితోడ
నలిగి ధరిత్రికి నరుగు దెంచినశచీ
దేవివో హరియురఃస్థితి దొలంగి]
కేళిఁ గ్రుమ్మరుపద్మగేహవో భవదీయ
జనకత్వమున సముజ్జ్వలితుఁ డైన
గీ. పుణ్యుఁ డేవంశమునవాఁడు పువ్వుఁబోఁడి
[జీవితేశ్వరుఁ డగు సుఖజీవితాత్ముఁ
డెవ్వఁ డబల! నీనామ మై యింపు మిగులు
శబ్ద మెయ్యది నాకు నిజంబు చెప్పుమ] (౬. ఆ.) 123

లక్షణము

గీ. ఒక్కఁడు నొకండు నుండుదు రంద్రు వాంద్రు
వారు వారలు సేయుచున్నారు సేయు
చున్నవా రిండు లిండ్లని ప్రయోగభేద?
ములతెఱఁ గెఱుఁగవలెఁ గవుల్ భుజగభూష! 124

లక్షణము

గీ. ధర ఋకారాంతశబ్దంబు ద్వంద్వమైన
రేఫ యగుచుఁ బ్రవర్తిల్లు దృఢముగాను
పత్త్రి వరహాయ వాగ్వధూనేత్ర ముఖసు
రాభివందితపాదాబ్జ యన్నయట్లు. 125

ప్రయోగము

ఆదిపర్వము - నన్నయభట్టు

ఉ. క్షత్త్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్త్రియవైశ్యశూద్రు లనఁగాఁ గలనాలుగుజాతులన్
స్వచ్ఛాచారిత్రము దప్పకుండఁగఁ బరీక్షితుఁ గాచినయట్లు రామ
మాంధాత్రరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యే
యుగంబునన్. (౨. ఆ.) 126

గద్యము

ఇది శ్రీమదశేషమనీషిహృదయంగమమృదుపదసీరంధ్ర శుద్ధాంధ్రరామాయణ ఘటనావైదుషీధురంధరాడిదము బాలభాస్కరకవి తనూభవ సరసకవిత్వవైభవ సౌజన్య నిధాన సూరయాభిధానప్రణీతం బైనకవిసంశయవిచ్ఛేదనం బనులక్షణంబునందు ప్రథమతరంగము

సంపూర్ణము.



శ్రీ ర స్తు

# క వి సం శ య వి చ్ఛే ద ము

## ద్వి తీ య త రం గ ము



ల క్ష ణ ము

గీ. ఊఁది పలుకుచోట నొాగిఁ దేల్చి పలికిన
రేఫ గాదు శకటరేఫ గాని
తద్భవపుఁ బదములఁ దవిలినయారేఫ
రేఫ గాని శకటరేఫ గాదు. 1

ఊది పలుకుచోట తేల్చి పలుకుట యెటువలె నంటే కఱ్ఱి మేను - కఱిమేను, కిఱ్ఱుచెప్పు - కిఱుచెప్పు, గొఱ్ఱె - గొఱియ, పుఱ్ఱె - పుఱియ, కట్టెఱ్ఱ - కట్టెఱ - యిటువంటివి.

శ్రీ - సిరి, స్మరుండు - మరుండు, అప్సరస-అచ్చర, కర్పూరము-కప్పురము, నిర్భరము-నిబ్బరము, స్థిరము - తిరము, అద్భుతము - అబ్బురము, ఆశ్చర్యము - అచ్చెరువు, అర్థము - అర, గర్వము - గరువము, పర్వము - పరువము, ధర్మము - దరమము- ఇటువంటి తద్భవపదములమీాద వచ్చినరేఫలు శకటరేఫలు గావు.

శకటరేఫ పద్యములు

క. చెఱుకెఱు కొఱఁపు మెఱపు కొం
దఱు పల్మఱు గొఱియ పుఱియ తఱి నెఱి మఱియుం

గఱచుట మఱచుట పఱచుట
వెఱచుట చెఱచుట విఱచుట వెఱగుం దెఱఁగున్. 2

క. మఱువును వందఱయును జూ
పఱ డగ్గఱ వాతెఱయును పఱి యఱిముఱియుం
గిఱిగొని గుఱుకొని నఱకుట
కొఱపుటయును కఱుకు చుఱుకు కుఱుచ తఱుచనన్. 3

క. నెఱుకలు పెఱవా రఱచే
యొఱకలు కొఱ కొఱవి తఱుము టిఱుకట పిఱుదన్
వఱలుట పఱియలు వఱియలు
కుఱు వఱముట తెఱచు టనఁగ కొఱగా మనఁగన్. 4

క. ఉఱుమఱ చేర్పఱచి వఱత
దఱియ యఱక యొఱుక పెఱ్క తఱుముట మిఱుమి
ట్లుఱువది కుఱుకులు నేమఱి
యొఱచుట నుఱుమాడి కొఱఁత యఱకడ చఱియున్. 5

క. తెఱ యే ట్రెఱ పఱపు పిఱికి
కఱటియు చిఱునగవు పగఱ కట్టెఱ కఱియున్
కఱచు ఱవును కఱకంఠుఁడు
చుఱచుఱ యక్కఱయు నుఱని చోఱుము డనంగన్. 6

ప్రయోగము

ఆదిపర్వము - నన్నయభట్టు

క. [1]ఉఱక నొకచేతఁ గూర్మముఁ
బెఱచేత గజంబు వట్టి పెనచి ఖగేంద్రుం

1. చఱచి యొకచేత (పా)

డిటికిఁగొని గగనవీథిం
బఱచె వియచ్చరవిమానపంక్తులు దూలన్. (౨. ఆ.) 7

ఆ ది ప ర్వ ము

సీ. [జనమేజయుఁడు సేయుసర్పయాగమునకు
విఘ్న మందఱము కావింత మతఁడు
ధర్మార్థి గావున ధారుణీసురుల మై
యడుగుద మీక్రతు వుడుగ మనియుఁ
గొందఱ మతనికిఁ గూర్చుమంత్రులము నై
యీజతుక్రియఁ జేసి యిహపరముల
కగుఁ జెక్కు దోషంబు లని హేతువులు సూపి
యుడిగింత మందఱ మొక్క మొగిన
గీ. భక్ష్యభోజ్యలేహ్యపానీయములమీఁద
సదములోని విప్రజనులమీఁద]
వెఱగుపడఁగఁ బాఱి వెఱపింతు మొజ్జలు
తత్ప్రయోగవిధులుఁ దప్పి పఱవ. (౨. ఆ) 8

ఆ ది ప ర్వ ము

సీ. [పాండుకుమారులు పాండుభూపతిపరో
క్షంబున హస్తిపురంబునందు
ధృతరాష్ట్రునొద్దఁ దత్సుతులతో నొక్కటఁ
బెరుఁగుచు భూసురవరులవలన
వేదంబులును ధనుర్వేదాదివిద్యలు
గఱచుచుఁ గడ లేనియొఱుకఁ దనరు
చున్న దద్విపులగుణోన్నతి సైఁపక
దుర్యోధనుండు దుష్కార్య మెత్తి

గీ. దుర్ణయమున శకునికర్ణదుశ్శాసనుల్
కరపఁ బాండవులకు నఱయ చేయఁ
గడఁగెఁ బాండవులును గడు ధార్మికులు గాన
బొరయ రైరి వారి దురితవిదుల. (౩. ఆ.) 9

ఆ ది ప ర్వ ము

క. ఎఱుక గలవారి చరితలు
గఱచుచు సజ్జనులగోష్ఠిఁ గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగినదానిన
మఱువ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్. (౩. ఆ.) 10

ఆ ది ప ర్వ ము

క. నెఱి నుఱక వైరివీరుల
నెఱకలు దూలంగ నేయునృపపుంగవునం
పఱ కోపక దయ వేఁడిరి
వెఱచి విషణ్ణు లయి సకలవిషయాధిపతుల్. (౪. ఆ.) 11

ఆ ది ప ర్వ ము

గీ. పఱువ నోపక యున్న మై మఱచి వెంటఁ
బెనఁగ నున్నను బ్రసవింప మొనసియున్నఁ
దెవులుపడి యున్న మృగములఁ దివిరి యేయ
వెఱచు నాహారముగ మనునెఱకు లైన. (౫. ఆ.) 12

ఆ ది ప ర్వ ము

క. కఱచునెడ నేయునెడ వడిఁ
బఱచునెడఁ బెనంగునెడ నపారబలంబుల్
మెఱయునెడ భీమునకు నం
దఱుఁ గీడ్పడఁ దొడఁగి రుద్ధతులు రాజసుతుల్. (౫. ఆ.) 13

ఆ ది ప ర్వ ము

క. మఱియు నొకనాఁడు నెవ్వరు
నెఱుఁగక యుండంగఁ గౌరవేంద్రుఁడు ధర్మం
బెఱుఁగక విష మన్నముతో
గుఱుకొని పెట్టించె గాఢ్పుకొడుకున కోలిఁ.(౫. ఆ.) 14.

ఆ ది ప ర్వ ము

సీ. వినవయ్య గౌతముం డనఁ బ్రసిద్ధుఁ డయిన
మునికి శరద్వతుం డనుమహాత్ముఁ
డురుతరతేజుఁ డై శరసమూహంబులో
నుదయించి వేదముల్ చదువ నొల్ల
కతిఘోరతపమున నుతభూసురోత్తముల్
వేదముల్ చదువున ట్టాదరమున
సర్వాస్త్రవిదుఁడు ధనుర్వేద మొప్పంగఁ
బడసి మహానిష్ఠఁ గడఁగి తపము
గీ. సేయుచున్న దివిజనాయకుఁ డతిభీతి]
నెఱిఁగి వానితపము చెఱుపఁ బనిచె
[జలజనయనఁ దరుణిఁ జలపద యనియెడు
దాని నదియు వచ్చె వానికడకు.] (౫. ఆ.) 15.

ఆ ది ప ర్వ ము

క. వెఱచఱవ నీఱిలో[1]న
క్కఱగా నొకమొసలి చూడ్కికి నగోచర మై

1. ఆతురముగా నని యర్థము. ఒక్కొరసా నని ము. పు. శకటరేఫము
కా దని తోఁచెడిని.

పఱతెంచి కుంభసంభవు
చిఱుతోడ వడిఁ బట్టికొనియె శిష్యులు చెదరన్.(ని. ఆ.)16

ఆదిపర్వము

క. గుఱుకొని కార్యాకార్యము
లెఱుఁగక దుశ్చరితుఁ డై యహితుఁ డగునేనిన్
మఱువక గురులైనను జను
[1]లెఱుఁగక శాసించునది మహీశుఁడు బుద్ధిన్. (ఁ. ఆ.) 17

ఆదిపర్వము

క. ఎఱిఁగితిమి దీని తెఱఁ గే
మఱ కెఱుఁగనియట్లు గూఢమతి నుండుద మిం
దఱ మింద పురోచనకృతి
నెఱి నేర్పడునంతకు న్విపీతాత్ముల మై. (ఁ. ఆ.) 18

ఆదిపర్వము

సీ. [కడునిద్రఁ గానిమిఁ దొడరుచు వడిగొని
నడువంగ నేరక తడవుచున్న
నెఱిఁగి చెచ్చెరఁ దల్లి నఱకట నిడి ధర్మ
సుతవిజయులఁ దనవితతబాహు]
యమలంబు లెక్కించి యముల నుత్సంగంబు
లెక్కించికొని భీముఁ డక్కజముగ
నరిగెడురయమునఁ దరులు సాల్వాడి మ్రొగ్గఁ
బదఘట్టనంబులఁ జదిసి రాలు]

1. లెఱుఁగఁగ. పు.

గీ. సుఖము గాఁగ నిట్లు నెఱయంగ సత్త్వంబు
మెఱసి రాత్రి నెల్ల నుఱక పవన
తనయుఁ డరిగెఁ [బవలు సనినట్లు చీకటి
యనక ముండ్లు గండ్లు ననక తెరలి] (ఉ. ఆ.) 19

ఆ ది ప ర్వ ము

చ. ఉఱఁడు సురేంద్రుఁడైన బలియుండు హిడింబుఁడు వాని దాడి
కీ, వెఱవనివారలుం గలరె వీరలు ముంద రెఱుంగ
రక్కటా, యెఱిఁగిన యేని యిట్లు తమయిండుల నుండిన
యట్లు మెచ్చ కే, పఱి శయనింతురే కడుఁ బ్రమాదము
నేసిరి బుద్ధిహీను లై. (ఉ. ఆ.) 20

సీ. [కాలమేఘంబును బోలి విశాల మై
నీల మై దేహంబు గ్రాలుచుండ
ఘనతటిల్లతలయ ట్లనిమిదిదంష్ట్రలు
మెఱయంగఁ బండులు గొఱికికొనుచు
[నతిరోషరోహితాయత వృత్తనేత్రము
ల్దిరుగంగఁ బెట్టుచుఁ బరుష కేశ
జాలంబు గాడ్పునఁ దూలంగఁ గాలోప
మానుఁ డై చనుదెంచి మానుషాదుఁ
గీ. దనుజఁ జూచి కష్టమనుజాలఁ గూడి నా
పనుపు సేయకుండఁ జనునె నీకు]
ననుచు నదరి పలుక విని హిడింబయుఁ గడు
వెఱచి భీమసేనుమఱువు సొచ్చె. (ఉ. ఆ.) 21

ఆ ది ప ర్వ ము

చ. నెఱికురులుఁ విలోలసితనేత్రయుగంబును నొప్పులొప్పువా
తెఱయును దీనియాననము తెల్పు కరంబు మనోహరంబు నే
నెఱిఁగినయంత నుండియును నిట్టిలతాలలితాంగిఁ జూచియే
నెఱుఁగ సురేంద్రకన్యకలు నిట్టిరె చూపవిలాససంపదన్. 22
(౭. ఆ.)

ఆ ది ప ర్వ ము

సీ. [యజ్ఞసేనప్రభు యజ్ఞమహావేదిఁ
గవచశరాసనఖడ్గబాణ
రథయుక్తుఁ డై మహారథుఁడు ధృష్టద్యుమ్నుఁ
డన నుదయించిన నతనితోడ
నొక్కటఁ బుట్టెను నొకకన్య కృష్ణ నా
నసితోత్పలశ్యామలామలాంగ
మెఱుపును బోలెను వఱలునుత్పలగంధి
[బంధురతరసౌరభంబు గలుగు
గీ. దాని ద్రుపదరాజతనయఁ దదీయస్వ
యంవరోత్సవంబునందుఁ జూడఁ
గనినవారు దృష్టి గనినఫలం బెల్లఁ
గనినవారు పరమకౌతుకమున.] (౭. ఆ.) 23

ఆ ది ప ర్వ ము

గీ. కఱకు దర్భపూరి పఱుపులు భిక్షాన్న
మశన మట్టివారి నతిముదమున
నాదరించెఁ బ్రీతి నాదిగర్భేశ్వరి
యయ్యు సేవగింప దయ్యెఁ గృష్ణ. (౭. ఆ.) 24

ఆ ది ప ర్వ ము

క. ఉఱుముచు మెఱయుచుఁ బిడుగులు
వఱలఁగ నల్గడలఁ బడ నవారితవృష్టుల్
గుఱుకొని కురియఁగఁ బంచెను
మఱియును నయ్యనలుమీఁద మఘవుం డలుకన్. (ర. ఆ.) 25

ఆ ది ప ర్వ ము

గీ. వెఱచి తల్లిదోఁక గఱపించుకొని దివిఁ
బఱచువానిఁ జూచి పార్థుఁ డలిగి
[వాని తల్లి శిరముతోన తత్పుచ్ఛంబు
దునిసి యగ్నిశిఖలఁ దొరఁగ జేసె.] (ర. ఆ.) 26

ఆ ది ప ర్వ ము

క. మఱచునొకో మఱవకుండియు
నెఱుఁగక యుండునొకో యనలుఁ డెఱిఁగియు నెద నే
మఱునొకో పుత్రులఁ గావం
గుఱుకొని నమ్మంగఁ దగునె క్రూరాత్ములకున్. (ర. ఆ.) 27

స భా ప ర్వ ము

క. వెఱచఱవఁ బట్టికొని వడిఁ
జఱచి జరాసంధు నొడలి సంధులయొమ్ముల్
విఱిచి వధియించి యార్చెను
వఱలఁగ భీముండు భువనవలయం బదురన్. (౧. ఆ.) 28

స భా ప ర్వ ము

క. వెఱచఱవ నింతకంటెను
దఱుచుగ బాణంబు లేసి తడయక పగఱం

జెఱుతు నని యిసుము చల్లుచు
నుఱక ధనంజయుఁడు రణజయోన్నతుఁ డరిగెన్. (౨. ఆ.) 29

అ ర ణ్య ప ర్వ ము

క. ఎఱుకని యెఱుఁగక నీకుఁ
మఱుకువ మార్గోన్న తప్పు మఱువుము నన్నుం
గఱకంఠా! క్షమియింపుము
నెఱి నెవ్వరి కెఱుఁగనగునె నీచరితంబుల్. (౧. ఆ.) 30

అ ర ణ్య ప ర్వ ము

సీ. [అర్ధరాత్రమునప్పు డందుల కేతెంచె
గజయూథములు జలాకాంక్షఁ జేసి
యంబుధివిమలజలంబు లాస్వాదింపఁ
జను దెంచుజలధరసమితియట్లు
చనుపలో నిద్రావసక్తులై యున్నవా
రున్నతద్వీపముల యుగ్రపాద
హతిఁ జేసి మర్దితు లైరి కొందఱు దంత
హతిఁ జేసి భిన్నాంగు లైరి కొంద]
గీ. అఱచి ప్రాణభీతిఁ బఱచి మహీజంబు
లెక్కి రందుఁ గొంద ఱుక్కణంగి
[చనుప యిట్టిపాటఁ బెనుపఱి యవినీతు
సిరియపోలె నడఁగి విరిసి చెడియె.] (౨. ఆ.) 31

అ ర ణ్య ప ర్వ ము

క. అఱపోఁడు గుఱుచ చేతులు
నొఱవశరీరంబు గలిగి యొరులకుఁ జూడం

గోఱగా కుండియు మన్మథు
నోఱవ్రులఁ బడియెడు నితండు యువతీప్రియుఁడై. (౨. ఆ.) 32

అ ర ణ్య ప ర్వ ము

చ. వఱలఁగ రాముఁ డంత ననవద్యుఁడు వచ్చి మహాప్రలాపియై
యఱుచుచు నున్నతల్లిని గృతాంతవశీకృతుఁ డైనతండ్రి ను
క్కఱఁ గని తీవ్రశోకపరిఖేదహతుం డయి తత్ప్రికారమం
దెఱేఁగి ముహూర్తమేనియు సహింపఁగ నోపక క్రోధదీప్తుఁడై.
(3. ఆ.) 33

నన్నయభట్టుగారి ప్రయోగములు ముగిసెను.

ఇంక నెఱ్ఱప్రగడగారి ప్రయోగములు

అ ర ణ్య ప ర్వ శే ష ము

క. ఉఱవగునారిక పంటలు
గోఱియల పాడియును దఱ చగుఁ బురుషులకుఁ
దెఱవలు చుట్టము లయ్యెద
రెఱచియ భుజియింతు రర్థి నెల్లజనంబుల్. (౪. ఆ.) 34

అ ర ణ్య ప ర్వ శే ష ము

చ. ఎఱుఁగక తప్పుఁ జేసితి సహింపఁగదే కడు దుర్భవంబునఁ
బఱుపకు మయ్య నావుడుఁ గృపన్ మునినాథుఁడు నివ్వి
ధంబుగా, నెఱుకుకులంబునందు జనియించియు ధర్మవు నెల్ల
నిమ్ముగా, నెఱిఁగెడు తల్లిదండ్రులకు నెంతయుఁ బ్రీతి యొనర్తు
భక్తితోన్. (౫. ఆ.) 35

అ ర ణ్య ప ర్వ శే ష ము

గీ. [1]పిఱికితన మేమఱుటయును నెఱవుతనము
[మెత్తబాటును గార్శ్యంబు నెత్తెఱంగు
నేరమియు విషయంబులం గూరుటయును
గలుగుపతికి నొందదు సిరి తొలఁగిపోవు] (౬. ఆ.) 36

అ ర ణ్య ప ర్వ శే ష ము

గీ. [సవ్యకరమునందును నపసవ్యకరము
నందుఁ బర్యాయసంగత మగుచుఁ జూడఁ]
గొఱవి ద్రిప్పినయొప్పున మెఱసెఁ బార్థు
[గాండివము వాలుఁదూపులగని యనంగ.] (౬. ఆ.) 37

అ ర ణ్య ప ర్వ శే ష ము

మ. పఱచుఁ దవ్వగఁ జేయలంతి నిలుచుం బట్టిక యాసాసలం
బిఱుబోవుం బొదలందు డిందుఁ బొడముం బిట్టుల్కి వేడాఁ
టుఁ గ్ర, మ్మఱి చూచుం జెవిదార్చి నిల్చుఁ గలచు న్నట్టాడుఁ
గోరాడు నే, మఱినట్లుండుఁ దృణంబు మేయు మలయుఁ
మాయామృగం బిమ్ములన్. (౬. ఆ.) 38

అ ర ణ్య ప ర్వ శే ష ము

క. తెఱపి గని దానవేశ్వరుఁ
డుఱక కృపాణమున నాఖగోత్తము నెఱకల్
నఱికినఁ గూలె నతం డిల
నఱవఱలై పవనహతమహాభ్రము వోలెన్. (౬. ఆ.) 39

1. పిఱికితనము నేమఱుటయుం గఱువతనము.

అరణ్యపర్వశేషము

క. అఱువదికోటులు కపివరు
లుఱక జగత్త్రియముఁ బెలుచ నువ్వెత్తు గొనం
దఱి గొన్నయట్లు నడువఁగ
నెఱసి కుముదుఁ డరుగు దెంచి నృపవరుఁ గనియెన్. (౭. ఆ.)

అరణ్యపర్వశేషము

చ. ఉఱుముచు సంత్యకాలజనితోగ్రబలాహకలీల దోపఁగాఁ
దఱుచగు ఘోరపుంబిడుగుతండముఁ బోని శరప్రతాన ము
క్కఱ దొఱగించుచుం గపిబలావళి ద్రుంచి కలంచె నేపున
న్నెఱఁకులు నొంచి బాణమయనీరధి ముంచె రఘుప్రవీరు
లన్. (౭. ఆ.) 41

అరణ్యపర్వశేషము

క. వెఱఁగుపడి హర్షరాగము
దఱిగినఁ గడువెల్లనై వదనములు వ్రాలన్
దెఱఁగేది ఱిచ్చవడి ర
త్తఱిఁ దత్పరిజనము లెల్లఁ దద్దయు వంతన్. (౭. ఆ.) 42

అరణ్యపర్వశేషము

చ. ఎఱుఁగక తప్పుగా మెలఁగెనేనియు దానికి సైఁచి నేరుపు
ల్గఱపి ప్రియంబుతోఁ గొలువు గైకొనఁగాఁ దగు మీకు
బాలురుం, దెఱవలు వృద్ధులుం దమకుఁ దెల్లము దప్పులు
చేసి రేనియున్, మఱితురు గాని యల్గరు సమగ్రశమాన్వి
తు లైనతాపసుల్. (౭. ఆ.) 43

అ ర ణ్య ప ర్వ శే ష ము

మ. నెఱయం బున్నమచందురుం జెనయునీనెమ్మోమునం దియ్య
మ్మై, చిఱునవ్వొప్పఁగఁ జూడ నీక పులకల్ చెన్నొంద ని
స్ఫురిచ్చి యక్కఱ దీరం బొరి నక్కునం గరము వేడ్కన్
జేర్ప నీ కెమ్మెయిన్, వఱవం ద్రోవఁగ జేసెనే యకట!
దైవం బెందుఁ జొత్తున్ సుతా!. (౭. ఆ.) 44

అ ర ణ్య ప ర్వ శే ష ము

చ. ఎఱిఁగితి నేను నిన్ను విబుధేంద్రుఁడ వీవు జగత్త్రయంబు
గ్రచ్చఱ భవదీయరక్షణమునంద వెలుంగుచు నుండు నట్టి
నిన్నుఱువుగ నేను వేఁడుకొన యుక్తుఁడఁ గాక మొఱంగి
నన్ను నక్కఱపడి నీవు వేఁడు టది కర్జమె నిర్జితదైత్య!
చెప్పుమా!. (౭. ఆ.) 45

ఎఱ్ఱాప్రగ్గడగారి ప్రయోగములు ముగిసెను.

ఇంక సోమయాజిగారి ప్రయోగములు

వి రా ట ప ర్వ ము

క. ఎఱిఁగెడువారికి నైనను
గఱపక తక్క రుచితప్రకారము లెల్లం
గొఱలు హితు లట్లగుట నం
దఱకును జెప్పంగవలయుఁ దగియెడుబుద్ధుల్. (౧. ఆ.) 46

వి రా ట ప ర్వ ము

గీ. తొఱగు వోకుండ మెకములు గఱవకుండఁ
బాడి దఱుగక యుండ నాపాటి గొల్ల

లిచ్చ మెచ్చఁగ నీదృష్టి కెక్కఁ గదుపు
నఱయ నేర్తు న న్నేలుము ధరణినాథ! (౧. ఆ.) 47

విరాటపర్వము

సీ. [శ్రవణపుటంబులు వ్రయ్యంగఁ దాఁకి సం
క్షోభంబు గావించె గుణముమ్రోఁత
బ్రహ్మాండభాండంబు వగులించి భూతని
శ్చైతన్య మొనరించె శంఖరవము
గగనభాగం బెల్లఁ గప్పి క్రాలుచు బెగ
డడరించె నుగ్రంపుఁ బడగపఱపు]
మిఱుమిట్లు గొని చూడ్కి పఱివోవఁ బెఱిగి ప
రిభ్రాంతి నేసెఁ గిరీటకాంతి
గీ. [తెల్ల మిది గాండివంబును దేవదత్త
మును గపిధ్వజమును వాసవుని వరమునఁ
గన్న మకుటంబు నగు వేఱ కొన్ని యైన
నుజ్జ్వలాద్భుతభంగు లై యున్నె యిట్లు] (४. ఆ.) 48

విరాటపర్వము

గీ. అఱసికొని యెన్నిభంగుల నైన నతని
తెఱవు మనవారి కగపడుతెఱఁగు గాంచి
యడరి బాసట యై యెవ్వ రడ్డపడిన
మెఱపు మెఱసినతెఱఁగునఁ దఱియఁ జొరుము.(౫. ఆ.) 49

విరాటపర్వము

క. అఱిముఱి నంగము లెల్లను
నుఱుముగ నిట్లడర నర్జునుని యమ్ములకుఁ

వెఱచఱచి సూతపుత్రుఁడు
పఱచెఁ బుడమి యద్రువ మత్స్యపతిసుతుఁ డార్వన్ (౪.ఆ.)

ఉ ద్యో గ ప ర్వ ము

సీ. [కవ లగ్రజన్ములకంటె నేమిటఁ గీడు
        ద్రుపదుఁ డల్పుండె తత్సుతులు బాహు
గర్వసమగ్రులు గారె విరాటుండు
        నాతనితమ్ములు నాత్మజులును
నసఁదులే సాత్యకి యలఁతులఁ బోయెడు
        వాఁడె వృష్ణికుమారవరు లనేకు
లట్టియోధులు పోర నరవాయి గొందురే
        పాండ్యుండుఁ గేకయపతులు నాది
క. యైనబంధులు మిత్రులు నగ్గలికలఁ
గొఱత వడియెడువారె యందఱును గెల్వ
నోపినను రుద్రునకు నైన నోర్వరాని
ధర్మపుత్రు కోపమునకుఁ దలఁక వలదె. (౧. ఆ.) 51

ఉ ద్యో గ ప ర్వ ము

క. ఎఱకలు విచ్చుచుఁ దుండము
దెఱచుచు వ్రేఁగడరి సోలి తేలి వివశుఁడై
యఱచిన నోడకు మని హరి
నెఱి సక్కఁగఁ ద్రోచి యొత్తె నెగయం గృపతోన్.(3. ఆ.)

ఉ ద్యో గ ప ర్వ ము

క. మఱచిరె ద్రౌపదిఁ గొలువునఁ
బఱచినబన్నంబు ధర్మపథముం దోలఁగన్

నెఱచుట కప్పటి కది దగుఁ
జెఱచినచో వెదకవలదె చిరతరకీర్తిన్. (ర. ఆ.) 53

ఉ ద్యో గ ప ర్వ ము

క. పెఱవారి నెల్ల దఱిమిడి
నఱుకుదుఁ బాండుక్షితీశనందనులను రూ
పఱఁ జేయఁ జేతు లాడవు
దఱుమరు నామీఁద నత్యుదగ్రత వారున్. (ర. ఆ.) 54

భీ ష్మ ప ర్వ ము

క. కొఱవియుఁ గొఱవియుఁ దాఁకిన
తెఱఁగున నర్జునుఁడు సురనదీసూనుఁడు చూ
పఱ వొగడఁ దాఁకుటయు ని
ద్దఱ దిక్కుల సైన్యములును దలపడియె వడిన్. (౧.ఆ ) 55

భీ ష్మ ప ర్వ ము

క. ఉఱక విరాటుబలముపై
గొఱియల పిండునకుఁ గవియుకొల్పులిక్రియ బి
ట్టఱ గవిసి నదీసూనుఁడు
నుఱుమాడె వియచ్చరులు వినుతి సేయంగన్. (౧. ఆ.) 56

భీ ష్మ ప ర్వ ము

క. అఱవఱ లయినరథంబుల
నెఱి దప్పక పడినయశ్వనికరంబులచేఁ
దఱుచుగఁ గూలినకరులఁ
గిఱిగొనియెఁ సమరమేదినీతల మెల్లన్. (౧ ఆ.) 57

భీష్మపర్వము

క. మఱుతురె యాడినమాటలు
బిఱుసని పోఁదగునె మీకు బెదరక యెదురై
తఱుముఁడు భీష్ముని గీష్ముని
నెఱుఁగరె ము న్నేను గలుగ నేలా వెఱవన్. (౨.ఆ.) 58

భీష్మపర్వము

క. వెఱచఱచి వెగడుపడి ని
వ్వెఱఁ గందుచుఁ గురుబలంబువీరు లతని డ
గ్గఱ కంత నంతఁ జూడఁగ
నుఱక నదీసుతుఁడు దాఁకె నుద్భటభంగిన్. (౨. ఆ.) 59

భీష్మపర్వము

క. విఱుగుట నొచ్చుట మనదెసఁ
దఱుచుగఁ జెప్పెదవు పాండుతనయులబల మే
త్తెఱ దఱుఁగక వెనఁగుట పలు
మఱుఁ జెప్పెద వకట! యేమి మాయయొ దలఁపన్.(3.ఆ.)

భీష్మపర్వము

క. అఱిముఱి గుఱ్ఱపుదడముల
కుఱికి కవలు రౌద్రరసమహోగ్రాకృతులై
నఱికిన నచ్చట రథములు
పఱపఁగ రా దయ్యె నుభయబలయోధులకున్. (3. ఆ.)61

ద్రోణపర్వము

క. తెఱపి గొని నీవు సొచ్చినఁ
బిఱుదన సొచ్చెదము రిపులు పెల్లగిలఁగ నం

దళమును మా కిది యెంతయు
నుఱునట్టివరంబు దీని నొసఁగుము పుత్రా!. 62

ద్రో ణ ప ర్వ ము

క. పెఱికితి నలుగుఁలు మేనులు
నెఱివడ నెల్లెడలఁ గలయ నివిరితి హారు లీ
తఱి నీళులు ద్రావక తె
ప్పిఱ వెట్లొకొ శత్రుసైన్యభీషణమూర్తీ!. (3. ఆ.) 63

ద్రో ణ ప ర్వ ము

క. ఎఱిఁగినఁ జేఱడు [1]చెఱుచుట
యెఱుకమెయిన్ మనకు దైవ మిచ్చినసిరి యి
ట్లఱిమిన యీలోఁ గ్రక్కున
నఱకు మితఁడు దెగిన మనమనఃపీడ దెగున్. (3. ఆ.) 64

ద్రో ణ ప ర్వ ము

చ. అఱిముఱిఁ ద్రెళ్లెఁ దేరులు గజావళి కూలెఁ దురంగమాంగ
ముల్, గిఱి గొనియెన్ మహీన్ భటులు లెక్కకు మిక్కిలి
సేన పాడుగా, నుఱు మయి రప్డు గృష్ణుఁడు నినాదము భూగ
గనాంతరంబునన్, దఱుచుగ నొత్తె నిర్మథితదానవ
సైన్యముఁ బాంచజన్యమున్. (3. ఆ.) 65

ద్రో ణ ప ర్వ ము

మ. విఱిగెం బెక్కు రథంబు లొక్కమొగి నుర్విం గూలె
శుండాలముల్, దఱుచై రాలెఁ దురంగమావయవసంతా
నంబు లింతింత లై, కుఱుకు ల్గట్టె భటాంగకంబులు రణక్షోణిం

1. చేరుట.

బ్రవాహంబులై, పఱచె న్నెత్తురు భూతకోటి విహరింపం
బ్రస్తుతింపఁగ సురల్. (ర. ఆ.) 66

ద్రోణపర్వము

క. మఱియు నతనిమెయి బాణము
లఱువది గీల్కొలుప నాబృహత్క్షత్త్రుం డే
డ్తెఱ సూతు నొంప నాతం
డఱిముఱి నారాచతతుల నవ్విభుఁ బొదివెన్. (ర. ఆ.) 67

విరాటపర్వము

చ. పరి చను దెంచి గోగణముఁ బట్టె ననఁగ విని పిన్నగాన మీఁ
దరయక రాజనందనుఁ డహంకృతిమైఁ జను దెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ దనబుద్ధి గలంగినఁ బాఱఁజొచ్చె ని
ప్పురుషుని శౌర్యసంపదయు భూరిబలంబు నెఱుంగఁ దేమి
యున్. (ర. ఆ.) 68

పరి చనుదెంచె నంటే కాలరులు వచ్చె ననుట - ఇది రేఫ
యయి ప్రవర్తించును.

శాంతిపర్వము

చ. పరిమెయిఁ బొఱి వానిఁ గనిపట్టి వెసఁగ బెడకేలు గట్టి తె
చ్చి రసురభర్త చూచి యిటు చేరఁగ దే వల దీకృతఘ్నునిం
బొరిగొని వే తినుం డనినఁ బోకడ మాలినవార మయ్యు యి
ద్దురితశరీరముం దినఁగ దోసము మా కని వార లొల్లమిఁగ.
(3. ఆ.) 69

స్త్రీపర్వము

క. పెరుగుట ప్రగ్గఁగఁ జవులం
బొరయుట యరుచంబు గాఁగఁ బుట్టుట పావం

చెరయుట పాయఁ బద్ధా

త్కరములనైజ మది యెట్లు దప్పింప నగున్. (౧. ఆ.) 70

స్త్రీ ప ర్వ ము

లయవిభాతి.—

సీ. పెరుగఁగ నిజాంగములు సరభసపరిస్ఫురణ
మరుదుగ జగావలులు నిరుపమవిధం బి
[న్నరపతిబలం బనఁగఁ గరయుగము తో లవియ
నురము చదిచెం బెలుచఁ దొడుఁగఁగఁ బోరి న్నె
త్తరులు ముఖరంధ్రములఁ బరవశత మానసముఁ—
బోరయుటకుఁ జొచ్చియును సరిగొనఁగఁ గంటిన్
వరసుతున కిప్పు డను పరమపదవి న్మగుడఁ
గురునృపతి యాప్రతిమఁ బోరి నిటులఁ బుచ్చెన్]
(౧. ఆ.) 71

భీ ష్మ ప ర్వ ము

చ. కరమున నున్న శూలమునఁ గ్రమ్ము మెఱుంగులు శత్రుసైన్య
భీకరములుగా గజాశ్వభటకాయములం గుది గ్రుచ్చినట్లు
గాఁ, జెరుపుచు వచ్చువానిఁ గురుసింహుఁడు సూచి మదాంధ
సింధురో, త్కరరభసాతిభీషణముగాఁ గవిసెం బటువిక్ర
మోద్ధతిన్. (3. ఆ.) 72

ల క్ష ణ ము

క. మనమునను మనమునం దన
మనమునయం దనఁగ మఱియు మనమం దనఁగాఁ

దనఘారి పెక్కు తెఱంగులఁ
బనిగొను నీసత్త్వమీవిభక్తులు గృతులన్. 73

మనమున, మనమునందు అనునివి రెండుశబ్దములును స్ఫుటములే. మనమునయందు, మనమునందు అనువాని కుదాహరణములు తెలుపఁబడును.

అరణ్యపర్వశేషము - శంభుదాసు

చ. ఉరమునయందుఁ గన్నులు పృథూదరదేశమునందు నోరుఁ
బ్ర, [స్ఫురితభుజద్వయంబు గలభూమిదరోన్నత భావమున్
గరం, బరుదుగ నుగ్ర మైనవికృతాకృతితోడ నశేషసత్త్వ
ఘ, స్మరుఁ డగుచున్నవానిఁ బటుసత్త్వుఁ గబంధునిఁ గాంచి
రచ్చటన్.] [౬. ఆ.) 74

శ్రీనాథుఁడు - నైషధము

మ. ఒకరత్నంబు విదర్భదేశమునయం దుద్భూత మై పార్థివ
ప్రకరంబుం భ్రమియింపుచున్నయది [సౌభాగ్యప్రభానిత్యల
క్ష్మికి సంకేతనివాస మై మదననిస్త్రింశంబు నాభీమక
న్యక నాఁగా దమయంతి నాఁ గలుగుపర్యాయాభిధానం
బులన్. (3. ఆ.) 75

ఉద్యోగపర్వము - సోమయాజి

స్రగ్ధర.
[గాండీవజ్యారవం బుత్కటమయి పెలుచం గప్పినం భీము]
బాహా, దండంబం దొప్పాశుభద్గద జడియుచు రౌద్రంబుగాఁ
దోఁచినన్ వే,దండద్వంద్వంబుమాడ్కిం దటెమి కవలు
మాద్యద్గతిం దాఁకినం జ్యా,కుండం బోకుండఁ గౌరవ్యులకు
వశమె బిట్టార్చి మూర్ఛిల్లకుండన్. (౧. ఆ.) 76

ఆముక్తమాల్యద - రాయలు

ఉ. [ఎన్నినుఁ గూర్తు నన్ను వినుమీ మును దాల్చినమాల్య
మిచ్చు] న, ప్పిన్నది రంగమం దయినపెండిలి నెప్పుము
[మున్ను గొంటి మే,వ న్ననదఁడ యొక్కమగవాఁ డిడ
నేను దెలుంగురాయఁడఁ, గన్నడరాయ యక్కొ డువఁగప్పు
ప్రియాపరిభుక్తభాక్కథన్. (౧. ఆ.) 77

లక్షణము

క. సేవింతు రనెడిచోటను
సేవిం త్రని యొక్కవేళఁ జెప్పినఁ జెప్పం
గావచ్చును గబ్బంబుల
సేవింత్రు నిలింపు లిందుశేఖరు ననఁగన్. 78

ప్రయోగము

ఆదిపర్వము - నన్నయభట్టు

గీ. తగిలి రుజయు రుజయు దైవవశంబున
నయ్యె నేని వాని ననుభవింత్రు
గాక యెఱిఁగి యెఱిఁగి కడఁగి యారెంటిఁ జే
కొందు రయ్యె యెట్టి కుమతు లయిన. 79

లక్షణము

క. మహితహలంతప్రథమా
బహువచనాంతాక్షరములపై నిలుపఁదగున్
బహుళాకారాంతపదవి
నిహితప్రథమావిభక్తి నియతిఁ దెలుఁగునన్. 80

అకారాంత పుల్లింగ ప్రథమావిభక్తివలె నిలుపవలె ననఁగా అకారాంతశబ్దము రామశబ్దము. దీనిమీఁద ప్రథమావిభక్తి నిలిపితే రాముడు. ఇటువలె హలంతములపై గూడ నిలుపవచ్చు ననుట - తకారాంత శబ్దమునకు పరీక్షితుఁడు - దకారాంత శబ్దమునకు గోత్రభిదుఁడు - సకారాంత శబ్దమునకు పురోధసుఁడు - శకారాంత శబ్దమునకు ఏతాదృశుడు - బహువచనమునం దేతాదృశులు - ఇటువలెనే యుక్తశబ్దములకు గూర్చునది.

లక్షణము.

గీ. తోడరి యాంధ్రవిభక్తులతోడఁ గలసి
సంస్కృతసమాసములు గొన్ని జగతిఁ బరఁగు
స్థిరభుజబలంబునం జిత్రి పురుషుఁ డంబి
కామనోవల్లభుం డనుకరణి ధరణి. 81

ప్రయోగము.

ఆదిపర్వము - నన్నయభట్టు

చ. ఫలపవనాంబుభోజనశుభవ్రతతృప్తులఁ జేసి చూడ దు
ర్బలతను లయ్యు బ్రాహ్మణు లపారతపోబలసంపదన్ మహా
బలయుతు లట్టివారలకు భవ్యుల కెన్న నసాధ్య మెం దిలన్
గలదె చరాచరాఖిల జగంబులఁ బెద్దల గారె చూడఁగన్.
(3. ఆ.) 82

అందుననే.—

గీ. పరఁగ నన్ను సాల్వపతి వరియించినఁ
దండ్రిచేతఁ బూర్వధత్త నైతి

[నమ్మహీశునకును నినయంబు నెయ్యాది
ధర్మ మెఱిఁగి దానిఁ దలఁపుఁ డీరు.] (౪. ఆ.) 83

నైషధము - శ్రీనాథుఁడు

ఉ. కాంచిరి నిర్జరేశ్వరు లఖండితరూపవిలాససంపదన్
వంచితపంచబాణుఁ డగువాని సముంచితసారధీరతన్
గాంచనభూధరంబునకు గాదిలినెచ్చెలి యైనవాని ని
ర్వంచితదానశక్తి సురరత్నముఁ బోలెడువాని నైషధున్. (3. ఆ.) 84

ఆదిపర్వము - నన్నయభట్టు

ఉ. [ఆయము గర్వమున్ విడిచి యన్యపతుల్ పనిసేయునట్లు]గాం
గేయభుజాశ్రయంబున నికృత్తసమస్తవిరోధి యై [కుమా
రాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె న
త్యాయతకీర్తితోఁ దనకు హస్తిపురం బది రాజధానిగాన్.] (౫. ఆ.) 85

అరణ్యపర్వము - నన్నయభట్టు

ఉ. పేఁకను నశ్వమేధములు వే యొనరించిన ధర్మశీలుఁ డి
క్ష్వాకుకులోద్భవుండు బలవంతుఁ డనంతయశుం డవార్యవి
ద్యాకరుఁ డుత్తముండు యువనాశ్వుఁ డపత్యము లేమిఁ జేసిదుః
ఖాకులుఁ డై ప్రధానవరులందు సమర్పితరాజ్యభారుఁ డై. (3. ఆ.) 86

అరణ్యపర్వము - నన్నయభట్టు

క. ఘనుఁ డీపార్థుఁడు నావల
నను దివ్యాస్త్రప్రయోగనైపుణ్యం డై

దనుజుల నివాతకవచుల
ననిఁ జంపి సురావలికిఁ బ్రియం బొనరించెన్. (౮. ఆ.) 87

లక్షణము

గీ. కడల ముత్త్వంబు గలతెన్గునుడువు లోలి
రహిని దేవమనుష్యపరంబు లైన
ముత్త్వములఁ బాసి తగ డుత్త్వముల భజించు
బల్లిదుం డక్కజుం డనుభంగి శర్వ! 88

ప్రయోగము

అరణ్యపర్వము - నన్నయభట్టు

సీ. [వజ్రసంహనను లవార్యపరాక్రముల్
పాండుకుమారు లాఖండలాభు
లందఱు నాగశతాయుతప్రాణు లు
గ్రాహవకాంక్షు లుత్సాహపరులు
వారలలో బలవంతుండు బకహిడిం
బాసురు లనువారి నాహవమునఁ]
జంపె నాగాయతసత్త్వ జరాసంధు
నెక్కటి నోర్చినయక్కజుండు

తే. ఘోరవనమున వీరు గిమ్మీరుఁ డను సు
రారి నిశ్చలభీకరాకారుఁ గిట్టి
పోర వధియించినట్టి సమీరజునకు
భూరిబలునకు మార్కొనువారు గలరె]. (౨. ఆ.) 89

అరణ్యపర్వశేషము - శంభుదాసు.

క. పట్టువడిన సుగ్రీవుని
కట్టెదురుగ వచ్చి యడరి కలుషితమతి యై

దట్టుఁడు లక్ష్మణుఁ డసురను
బిట్టేచెను పిడుగు వోనిపృథుబాణములన్. (౫. ఆ.) 90

విరాటపర్వము - సోమయాజి

ఉ. ఆవల వచ్చునాపదల కన్నిటి కోర్చి లతాంగిఁ గూర్చి నా
కీ వెడమాటలన్ మరలఁ డెన్నివిధంబులఁ జూపి చెప్పినం
గావలుఁ డైనవీఁడు దగుకార్యము వట్టునె వీని కెమ్మెయిం
జావు నిజంబు మన్మథుని శాతశరంబుల నైన నక్కటా! (౨.ఆ)

ఇటులనే బెట్టిదుఁడు, బల్లిదుఁడు, నెయ్యుఁడు, ఉక్కివుఁడు, బెట్టిదుఁ డనఁగా బెట్టిద మైనవాఁ డనుట.

లక్షణము

క. పోలఁగ నెల్లిద మనుచో
నేలిద మని యొక్కవేళ నిడఁదగుఁ గృతులన్
భాలాక్షు త్రిపురవిజయం
బేలిద మై వినుతి కెక్కె నిల ననుమాడ్కిన్! 92

ప్రయోగము

ఆదిపర్వము - నన్నయభట్టు

క. బాలుఁ డని తలఁచి రిపుతో
నే విధముగఁ గలసి యునికి యిది కార్యమె యు
త్కీలానలకణ మించుక
చాలదె కాల్పంగ నుగ్రశైలాటవులన్. (౬. ఆ.) 93

లక్షణము

క. వినుచుండె వినుచు నుండెం
దన కిచ్చెను దనకు నిచ్చె ధర్మువు ధర్మం

బును ప్రౌఢిమంబు ప్రోడిమ
యొనరంగన నొనరఁ గనఁగ నుభయముఁ జెల్లున్. 94

లక్షణము

గీ. అనక నాక, మీరు రీరును, చనునె చన్నె
భయపడి భయంపడి మఱియు భయము పడియు
నుమ్మలిక యుమ్మలికమును, నూర్ధ్వరేతుఁ
డూర్ధ్వరేతసుం డని చెప్ప నొప్పుఁ గృతుల. 95

లక్షణము

గీ. అవని రెండవ మూఁడవ యనుపదముల
కచ్చు యతి గూర్చఁ జెల్లు రెండవ సురద్రు
మంబు భక్తుల కంబికామానసాంబు
జార్కుఁ డిందుశిఖామణి యన్నయట్లు. 96

ప్రయోగము

సభాపర్వము - నన్నయభట్టు

సీ. ఆయంబునందు నాలవభాగ మొండె మూఁ
డవభాగ మొండె నం దర్ధ మొండెఁ
[గాని మిక్కిలి సేయఁగాదు వ్యయం బని
యవధరించితె బుద్ధి నవనినాథ!
యాయుధాగారధనాధ్యక్షతలయందు
వరవాజివారణావళులయందు
భండారములయందుఁ బరమవిశ్వాసుల
భక్తుల దక్షులఁ బంచి తయ్య

తే. గురుల వృద్ధశిల్పివరవణిగ్బాంధవ
జనుల నాశ్రితులను సాధుజనులఁ

గరుణఁ జేసితికము పొరయకుండఁగఁ బ్రోతె
సకలజనులు నిన్ను సంస్తుతింప॥ (౧. ఆ) 97

లక్షణము

గీ. ఎఱుక గలవారె యనుచోట నెఱుక గలరె
యిట్టివారె యనెడుచోట నిట్టిరె యగుఁ
జేయఁ గలవారె యనుచోటఁ జేయఁగలరె
యనుచు లోకప్రసిద్ధోక్తి యగుట శర్వ!। 98

ప్రయోగము

సభాపర్వము - నన్నయభట్టు

సీ. [తద్ద్వారపాలురు దారుణాకారు ల
పారబలాఢ్యులు పార్థుకడకుఁ]
జనుదెంచి సురరాజసన్నిభు నాతనిఁ
జూచి యచ్చెరుపడి శూరు లెందు
నీయట్టిరే కురునృపవరపర్యాప్త
మయ్యె నీవిజయవిఖ్యాతిశయము
[వసుమతీనాథు లెవ్వరు నిట్లు బలిమిమై
నిట వచ్చిరే తొల్లి యేయుగముల
గీ. నున్నతప్రతాప! యుత్తరకురుభూము
లండ్రు జనులు వీని నవనిచరుల
కివి యగోచరంబు లివియు సాధించి యొ
య్యవి గొనంగ లేవు తివిరి నీవు. (౧. ఆ.) 99

విరాటపర్వము - సోమయాజి

ఉ. [రోహిణి యొండె నొండెను నరుంధతి గాక మనుష్యజాతి
యే, యీహరిణాక్షి చెల్వమున కీడ్తైఁ జూడ్కులు గాఁ

చికోలు గ్రాదా హితగౌరవం బగు శుభాంగముఁ దేజముఁ
జూడ బుద్ధి సం, దేహముఁ బొందుచున్నది] సతీజను లిట్టిరౌ
రూపసంపదన్. (౧. ఆ.) 100

అరణ్యపర్వము - వాగనుశాసనుఁడు

క. అమిత మగునీదుతపమును
హిమ యెఱుఁగక యిట్లు చేసె నిది దీని సహిం
పుము దయ మత్తైన్యనిరో
ధము వాపుమ యెఱుక గలరె యబలలు ధరణిన్. (౩. ఆ.)

అరణ్యపర్వము - నన్నయభట్టు

క. అలయక యేడులు కడుఁ బె
క్కులు జీవించుట నెర గలుగుటయుం గడు వృ
ద్ధుల లక్షణమే జ్ఞానము
గలఁ డేనియు బాలుఁ డైనఁ గడు వృద్ధు మహిన్. (౩. ఆ.)

జ్ఞానము గలఁడేని యనఁగా కలవాఁడే యనుట.-

ద్రోణపర్వము - సోమయాజి

క. గురులకు భక్తుఁ డుదారుఁడు
కరుణ గలఁడు శౌర్యధైర్యగాంభీర్యధురం
ధరుఁడు మొగ మోడు నాసుర
వరపాత్రునిలేమి కోర్వవచ్చునె చెపుడా. (౨. ఆ.) 103

అరణ్యపర్వశేషము - శంభుదాసు

శా. ద్యూతవ్యాజమునన్ సభాంగణములో దుర్యోధనుం డట్లు
దుర్నీతిం గూడి యొనర్చినట్టి యఘముల్ నిష్కంపధైర్యో
న్నమ, చ్చేతస్సారుఁడ వైననీ కొకనికిన్ జెల్లెన్ సహింపంగ

వి,ఖ్యాతశాంతులు లేరె ధార్మికులు నిక్కం బట్టిరే యెవ్వ
రు. (ర. ఆ.) 104

లక్షణము

గీ. చిగిరిచె చిగిర్చె చిగిరించె చివిరిచె నన
మనిచె మంచెను వినుపించె వినిచె ననియు
గ్రుమ్మరిచె గ్రుమ్మరించె చేకూరె ననుచు
చేకురె నటంచుఁ జెప్పంగఁ జెల్లుఁ గృతుల. 105

లక్షణము

గీ. అంతమాత్రం బనంగను నంతమాత్ర
యనఁగ చైదమనం జైది యనఁగఁ జెల్లు
నాటఁగోలె యనంగను నాటగోలె య
నంగఁ జెల్లును గృతులం దనంగమథన!. 106

ప్రయోగము

అరణ్యపర్వము - నన్నయభట్టు

సీ. [ఒక్కకర్ణంబు నీలోత్పలశ్యామ మై
తను వెల్లఁ గలహంసధవళ మైన
యట్టిగుఱ్ఱములు వే యక్కన్య కుంకువ
యీ నోపుదేని మునీంద్ర! దీని
నమరంగఁ బెండిలి యగు నిది మాకుల
ధర్మంబు నావుడుఁ దనరఁ బెండ్లి
యగువేడ్క భార్గవుఁ డప్పుడ వరుణేంద్రు
పాలికిఁ జని వానిఁ బడసి తెచ్చె]

గీ. నవనినాథ! గంగయందుఁ గన్యాకుబ్జ
పురమునందు నొందఁ బుట్టినట్టి
[1]హాయసహస్ర మమల మై నాటఁగోలె నశ్వ
తీర్థ మనఁగఁ బరఁగు దీనిపేరు. (3. ఆ.) 107

అరణ్యపర్వశేషము - శంభుదాసు

ఉ. పుట్టిన [2]యాఁబునాళ్లుగొలె పొంపిరివోయి జగంబు లన్ని
యుఁ, దట్టుఁడ వై జయించితి ముదంబున నీదుమహత్త్వ
మెంతయుం, జిట్టలు గాదె యిట్టియవి జేయుఁడ వింద్రపదంబు
నీక గాఁ,బట్టము గట్టి యేలుము గృపన్ మము నెల్లను
వహ్నిసంభవా!. 108

లక్షణము

గీ. పాఱుఁ డల్లుఁడు తమ్ముఁ డన్పదము లోలిఁ
దగ సమాసంబు లైన దుత్వములఁ బాయు
నల్లువాండ్రనఁ బాఱువాండ్రనఁగఁ దమ్ముఁ
గుఱ్ఱ లనఁ దెన్గుపదములు కొన్ని యిట్లు. 109

గద్యము

ఇది శ్రీమదశేషమనీషి హృదయంగమ మృదుపద నీ
రంధ్ర శుద్ధాంధ్ర రామాయణ ఘటనా వైదుషీధురంధరాడిదము
బాలభాస్కరతనూభవ సరసకవిత్వ వైభవ సౌజన్యనిధాన
సూరయాభిధాన ప్రణీతం బైనకవిసంశయవిచ్ఛేదనం బనులక్ష
ణంబునందు ద్వితీయతరంగము.

---

1. హాయసహస్ర మమలమై నాటఁగోలెను నశ్వతీర్థ మనఁగ నయ్యె నదియుం. ము. పు. 2. రూఁబునాళ్లఁకును బొంపిరి—ము. పు.

శ్రీరస్తు

# కవిసంశయవిచ్ఛేదము

## తృతీయతరంగము



### తద్భవపద లక్షణము

సీ. అ ఇ ఉ లానిడుద లే ఐ లు నోఔలును
వర్గాదిమతృతీయవర్ణకములు
యరలవల్ సా గూడ నైదైదు లక్కార
ములు గల్గు శుద్ధాంధ్రమునకు నోలి
చజలు లే వవి రెండు చ్ఛజే లగు నై ఔల
కయి యవు లగును ద్విత్వైకవర్ణ
ములు విడి యిఱువర్ణము లగును [1] నెఱసున్న
లఱసున్న లగు నొక్కయవసరమున

గీ. వర్ణముల నైన మాత్రలవలన నైన
వికృతి తద్భవమునకుఁ గావింపవలయు
నదియ ప్రాకృతరీతి యై యతిశయిల్లు
వీని పద్ధతు లెఱిఁగింతు వినుఁడు దెలియ. 1

గీ. గిలుక సుడి సున్న క్రారయు కియ్యొ దొలఁగు
2. క్రార యొక్కొకచోఁ దొలంగకయ యుండు

3. హ్రస్వవర్ణంబు లగును దీర్ఘాక్షరములు
వనుఁగు లగు క్రిందిమీఁది సంజ్ఞాక్షరములు. 2

గీ. 1ద్విత్వవర్ణంబులకును మీఁదిదియ యొండె
క్రిందిదియ యొండె తొలఁగును 2 జెందు డుమువు
లొక్కకొన్ని పదంబుల కురగభూష
3 కలుగు బంధుత తటవర్గములకు శర్వ! 3

సీ. 1అ 2ఇ 3ఉ 4లేకారంబు లాదేశములు (ముబు
లాగమంబులు ప్రథమైకవచన
మున) కేత్వము లఘుత్వము భజించు దానికి
నాదేశ మియ యగు నలిననేత్ర
6 యిరి 7 యిర 8 మువ (యడి) 9 యెరు లాదేశంబు
లగు కొన్ని పదముల కయుగనేత్ర
(పొల్లు లౌను పదాంతహల్లులు పరమేశ)
10. హాయల కాదేశము లచ్చు లగును
11 బొట్లు ద్విత్వంబు లాగమంబు లగు శబ్ద
సరళతకుఁ గొన్నియెడలను చంద్రమౌళి
12 తద్భవము దేవమనుజశబ్దంబు లైన
నుడుగు నొక్కొకచోట డుమాగమంబు.

గీ. 1 ధర యథాపూర్వవర్ణశబ్దప్రతతికి
నొలి కొన్నిటి కాదేశ ముత్వ మగును
తద్భవంబజ్విభ క్త్యేకతకు భజించు
తఱచుగా దీనిపద్ధతు లెఱుఁగవలయు. 4

సీ. వర్గంబుల ద్వితీయవర్ణ 2 చతుర్థవ
ర్ణములు తదాదివర్ణత భజించు
3 ననాళలలకు రేఫలకు తథదధలకు
టడల కాదేశంబు డత్వ మగును
4 తెఃౌలకు చసలు క కారంబు చేకూరు
5 శషచల కెల్లను సత్వ మగును
6 కత్వదాత్వములకు యత్వ మాదేశ మౌ
7 జ్ఞణలల నత్వంబు సంభవించు
వరుస 8 తచ 9 రల 10 చస 11 టడ 12 వప 13 ననలకు
14 కగల కన్యోన్యసంప్రాప్తి గలుగుచుండు
యతులకును బలె వర్ణైక్య మగును తలుచు
15 ణనమలు తదాదివర్ణబాంధవము గాంచు. 5.

క. 1 షత్వమునకు వత్వం బగు
వత్వమునకు గత్వసత్వబత్వంబు లగుఁ
ఖత్వంబు వరుస కత్వము
గత్వం బగుచుండు శైలకన్యాభరణా !. 6.

క. 1 ఋత్వమునకు (నిత్వమ్మును)
నేత్వము సిద్ధించు 2 నోత్వ మెనయును నుత్వం
3 బౌత్వమునకు నోత్వం బగు
4 నైత్వం బేత్వ మగు సుమశరాసన[illegible]

గీ. 1 హాజబలకు బిందుపూర్వక మయ్యె నేని గు [illegible]
గత్వ మాదేశ మగుచుండుఁ గాలకంఠ !

2 యత్వమునకు నాదేశము జత్వ మగును
3 యూష్మ లంతస్థలును భేద మొందకుండు. 8

గీ. 1 అచ్చులకు వత్వ మాదేశ మగును 2 రిత్వ
మగును ఋత్వంబు 3 తఱి విభక్త్యై కలోప
ము లగుపదములు తద్భవంబు లగు కొన్ని
4 కొన్ని మాత్రె కవికృతు లగు స్నేహాశ! 9

గీ. 1 కలుగు బంధుత్వ మనునాసికలకు నెల్ల
2 వగవ వర్ణంబు లేకభావనఁ జెలంగు
3 తాలకును యాలు జనియించు నీలకంఠ
4 యదుకఁబడు క్రార లోక కొన్ని పదములకును. 10

ఉదాహరణము

ఠ. (1) యువతి - ఉవిద
నిశ్రేణి - నిచ్చెన
శష్కులి - చక్కిలము
జ్ఞాని - జాణ
వీనికి అకార మాదేశము.
ఠ. (2) కాకము - కాకి.
కుద్దాలము - గుద్దలి
నీవారము - నివ్వరి
ఢక్క - డక్కి
శృంఖల - సంకిలి
చంపకము - సంపంగి
మానుషశబ్దము - మానిసి
కూష్మాండము - గుమ్మడి
పిష్టము - పిండి
శ్రవశ్శబ్దము - చెవి
ద్వయము - దోయి
లాంగలము - నాగలి
మృత్యువు - మిత్తి
ఖర్జువు - గజ్జి
పశువు - పసి
ఖడ్గము - కత్తి
ద్వీపము - దీవి
రాక్షసుఁడు - రక్కసి
తాళము - తాడి
ఖట్వ - కంకటి
సురత్రాణశబ్దము - సులతాని

వీనికి ఇకార మాదేశము

౫. (1) యథాపూర్వాక్షరములమీద నుత్వాదేశము వచ్చును:—

వృద్ధశబ్దము - వృద్ధు
మూర్ఖశబ్దము - మూర్ఖు
దుష్టశబ్దము - దుష్టు
ధూర్తశబ్దము - ధూర్తు
మూకశబ్దము - మూకు
పన్నీరము - పన్నీరు
రూపము - రూపు
కళంకము - కళంకు
మానము - మాను
వాదము - వాదు
నాదము - నాదు
వర్గము - వర్గు
శీతము - శీతు
పట్టము - పట్టు
అంగము - అంగు
స్థలము - తావు

౮. (3) అయథాపూర్వాక్షరముల మీదను ఉత్వాదేశము వచ్చును:—

యామము - జాము
వైద్యుండు - వెజ్జు
కాచము - గాజు
రాజన్ - రాజు
తేజము - తేజు
భుజంగము - బొజుంగు
పురము - ప్రోలు

ఏకశబ్దము - ఒక్కు
దర్వి - తెడ్డు
కాలము - కారు
స్తంభము - దుబ్బు
సత్యము - సత్తు
జంగముండు - జంగము
కుబ్జశబ్దము - గుజ్జు
వేత్రము - బెత్తు

| | |
|---|---|
| వయస్తపో మనశ్శబ్దముల మీఁద | వయసు తపసు మనసు |

యోధు - జోదు
అంఘ్రి - అడుగు
గర్భము - కడుపు
సంధి - సందు
కంఠము - గొంతు
స్తనము - చన్ను
భటుండు - బంటు
తిలము - నువ్వు
స్థలము - తావు
బీజము - విత్తు

౮. (4) ఎత్వాదేశము వచ్చినందుకు.

దండము - దండె
వీణ - వీణె
పట్టము - పట్టె
ముస్త - ముస్తె
మల్లి - మల్లె
అయథాపూర్వాక్షరములమీఁద:—

త్రికము - తీగె
సంధ్య - సందె
జాలము - జాలె
వర్ణము - వన్నె
కన్య - కన్నె
చిహ్నము - చిన్నె
కాష్ఠము - కట్టె
ముద్ర - ముద్దె
విద్య - విద్దె
ప్రజ్ఞ - పగ్గె
దీపము - దివ్వె
గద - గదె
భోజకస్త్రీ - బోనకత్తె

ఋ. (5) ఎత్వమునకు ఇయాదేశము.
వన్నె - వన్నియ
కన్నె - కన్నియ

ఋ. (6) ఇరి.
సాక్షి - సాకిరి

ఋ. (7) ఇరము
భిక్ష - బికిరము

ఋ. (8) ఉవాదేశము.
అర్ఘ్యము - అగ్గువ
సత్త్వము - సత్తువ
త్యాగము - తెగువ
పర్వము - పండువ
వస్త్రము - వలువ
హింగు - ఇంగువ
కుల్య - కాలువ

ఋ. (9) ఏరి.
దేవి - దేవేరి

ఋ. (10) హంస - అంచ
యశము - అసము

ఋ. (11) బొట్లు ద్విత్వంబు లాగమంబులగు శబ్దసరళతకు.
ఎటువలెనంటే :—
కేతకి - గేదఁగి
దీనికి బిందుప్రాప్తి
లాక్ష - లక్క
దీనికి ద్విత్వప్రాప్తి.

ఋ. (12) దేవమనుష్యశబ్దములు తద్భవమైతే దుఙాగమము కొన్నిటికి లేదు-
కొండవీటి జంగము
జోదు
ఇటువలెనె: —

ౠ. (1) గిలుక, సుడి, సున్న, క్రారయుం, కియ్యదోలఁగు ఎటువలెనంటే:—
వర్తి - వత్తి
మృదువు - మెదువు
ఏకాంతము - ఏకతము
ధాత్రి - దాది
మాణిక్యము - మానికము

ౠ. (2) క్రారయొక్కచో దొలంగకయ యుండు.

ప్రౌఢ - ప్రోడ

౨. (3) హ్రస్వవర్ణంబు లగును దీర్ఘాక్షరములు.

కస్తూరి - కస్తురి

౩. (1) ద్విత్వవర్ణంబులకును క్రింది దియ యొండె మీదిదియ యొండె చెడు నన్నందుకు.

స్నిగ్ధము - నిద్దము

స్వామి - సామి

౩. (2) డు ము వు లుం జెందు కొన్ని పదములకు.

ఒక్క - ఒక్కడు

నాణె - నాణెము

భరశబ్దము - బరువు

౩. (3). బంధుత తటవర్గములకు.

చిత్రములు - చిట్టలు

ఖడ్గము - కత్తి

౬. (1) వర్గ ద్వితీయాక్షరములకు వర్గ ప్రథమాక్షరప్రాప్తి.

ముఖము - మొకము

సఖి - సకి

సుఖము - సుకము

శిఖ-సిక } వికల్పము
సిగ

ఇచ్ఛ - ఇచ్చ

పాఠ - పాట

శుంఠి - సొంటి

పీఠము - పీట

కథ - కత

వ్యథ - వెత

గ్రంథి - కంతి

స్థిరము - తిరము

స్థూలము - తోరము

ఫలకము - పలక

౬. (2) చతుర్థవర్ణములకు తృతీయ వర్ణప్రాప్తి

ఘని - గని

జంఝాటము - జంజాటము

ప్రౌఢ - ప్రోడ

బుద్ధి - బుద్ది

వృద్ధశబ్దమునకు పెద్ద

ప్రభ - పబ

౬. (3) న, ణ, ళ, ల, ర, త, థ, ద, ధ, ట, ఠ లకు డత్వాదేశము వచ్చినందుకు.

అంగనము - అంగడి

ప్రేంఖణము - పెంకడము

గ్రామణి - గామిడి

ముకుళము - మొగడ

నారికేళము - నారికడము

ప్రవాళము - పవడము

వకుళము - పొగడ

ప్లవము - పడవ

సంగరము - జగడము

పతాక - పడగ
తంతువు - త్రాండు
పృథివి - పుడమి
వర్ధకి - వడ్రంగి
శ్రద్ధ - సడ్డ
వృద్ధి - వడ్డి
మేధి - మేడి
అటవి - అడవి
జట - జడ
మంటపము - మండపము
ధాటి - దాడి
కర్నాటము - కన్నడము
ప్రౌఢ - ప్రోడ

౪. (4) క్షకారమునకు చ, స, క లు వచ్చినందుకు:—

లక్ష్మి - లచ్చి
ఇక్షు - ఇంచు
క్షేమము - సేమము
సూక్ష్మము - సైకము
లాక్ష - లక్క
పక్షి - పక్కి
దక్షిణము - దక్కినము
యక్షులు - జక్కులు
పరీక్షించి - పరికించి
క్షారము - కారము
ద్రాక్ష - దాక

౫. (5) శ, ష, చలకు సత్వప్రాప్తి

శాల - సాల
ఆశ - ఆస
దిశ - దెస
ఆకాశము - ఆకసము
ఆపోశము - ఆపోసనము
శుల్కము - సుంకము
శలాక - సలాకు
రోషము - రోసము
ఈర్ష్య - ఈరసము
దోషము - దోసము
వేషము - వేసము
భాష - బాస
విషము - విసము
నిమిషము - నిమిసము
మషి - మసి

౪. (6) కహలకు యత్వాదేశము.

దీర్ఘిక - డిగ్గియ
మల్లిక - మల్లియ
ఘటికాయంత్రము - గడియారము
స్నేహము - నెయ్యము
సందేహము - సందియము

౪. (7) జ్ఞ ణలకు నకార మాదేశము.

యజ్ఞము - జన్నము
ఆజ్ఞ - ఆన
ఆజ్ఞప్తి - ఆనతి
సంజ్ఞ - సన్న
విజ్ఞాపనము - విన్నపము

జ్ఞానము - నాణెము
గుణము - గొనము
ద్రోణి - దోని
పూర్ణిమ - పున్నమ
శాణము - సాన
త్రిలింగము - తెనుంగు
లాంగులము - నాగలి
లజ్జ - నాన
౮ (8) తవర్గమునకు చవర్గము, చవర్గమునకు తవర్గమాదేశము - ఎట్లనిన
చించ - చింత
భూతము - బూచి
సూచి - సూది
గుచ్ఛము - గుత్తి
జాతి - జాజి
ప్రాంతము - పజ్జ
రథ్యము - రచ్చ
వ్రజశబ్దము - వ్రేంత
కక్ష్యము - క్రంత
ఛిన్నము - చేదు
త్యాగము - చాగ
చిరశబ్దము - తడవు
తరుశబ్దము - చెట్టు
బీజము - విత్తు
ఇటువలెనే -
ఉ. (9) రేఫలకారములకు:—
క్రూరుఁడు - కూళ

కవిసంశయ—6

స్థూలము - తోరము
అగురు - అగులు
పాత్రము - పళ్లెము
కర్తరికము - కత్తెర
గంధర్వుఁడు - కత్తళుఁడు
ఉ. (10) చసలకు.
నారాచము - నారసము
హంస - అంచ
ఉ. (11) టడలకు
జట - జడ
కరండము - కరాటము
ఉ. (12) వ, పలకు.
శవము - సవము
ద్రౌపది - దోవది.
ఉ. (13) నణలకు.
విజ్ఞానము - విన్నాణము
శాణము - సాన
ఉ. (14) కగలకు.
ద్వికము - దుగ
పూగము - పోక
ఉ. (15) ణనలకు వర్గసంబంధము కలదు - ఎట్లనిన -
అంగణము - అంగడి
తిలము - నువ్వు
మృత్తు - మన్ను
మృదువు - మిన్న
అంబ - అమ్మ
తాంబూలము - తమ్మలము

౬ (1) హాజబలకు గకారము:—
సింహము - సింగము
సింజని - సింగిణి
కంబళము - గొంగళి

౬ (2) యకారమునకు జకారమాదేశము-
యోగి - జోగి
ద్యూతము - జూదము
యౌవనము - జవ్వనము
యముడు - జముడు
యత్నము - జతనము
యంత్రము - జంత్రము

౬ (3) ఊష్మ లంతస్థములు భేదమొందకుండు.
కుశలము - కడవ
గుహా - గవి
గృహము - గివము
కుటీరము - గుడిసె
శేఫాలిక - వావిలి
వైశ్యులు - బేరులు

౬ (3) అంతస్థల కన్యోన్య మాదేశమాను:—
తిత్తిరము - తీతువ
కల్హారము - కలువ
కిరీటి - కవ్వడి
హేయము - ఏవము
వర్తులము - వట్రువ

౭ (1) మత్వమునకు వత్వప్రాప్తి ఇది అపభ్రంశభాష.
హిమము - ఇవము
క్రమము - క్రవము
శ్యామంతిక - సేవంతి
సమత్వము - సవతు

౮ (2) ఉత్వమునకు నోత్వము:—
కులము - కొలము
కుడ్యము - గోడ
కుంతి - గొంతి
తుండము - తొండము

౮ (3) ఔత్వమునకు నోత్వప్రాప్తి:-
క్రౌంచము - కొంచ

౮ (4) ఐత్వమునకు నేత్వము.
వైరము - వేరము

౮ (1) ఋత్వమునకు నేత్వము
నృత్యము - నెత్తము

౯ (1) నెఱసున్న లఱసున్న లవును:-
తరంగములు - తరఁగలు
కాంత - కాఁత

౧౦ (1) అచ్చులకు వత్వాదేశము.
అన్నము - వణ్ణము
అశ్వము - వారువము
ఉష్ణము - వెచ్చ
ఓఢ్రశబ్దము - వడ్డె
ఆఖేటము - వేట
ఉత్కృష్టము - వెక్కసము

౧౦ (2) ఋత్వమునకు రిత్వాదేశము.
ఋక్షము - రిక్క
౧౦ (3) విభక్త్యేకలోపములు.
పనసః - పనస
ఇటువలెనే
కుండః - కుండ
౧౦ (4) మాత్రైకవికృతి.
కులము - కొలము
౧౧ (1) కలుగు బంధుత్వ మనునాసిక
లకు నెల్ల:—
ద్రోణము - తూము
ద్రోణశాకము - తుమ్మి
ఫణి - పాము
సంజ్ఞ - సన్న
రాజ్ఞి - రాణి
తూణము - దొన
౧౧ (3) తకారమునకు యకారము.
రాత్రి - రేయి
వక్త్రము - వాయి
గృంజనము - గంజాయి.
౧౧ (4) క్రారలకు.
తంతువు - త్రాడు
కబరి - క్రొమ్ముడి
(ఇటువలె పైశాచిక రూపములు)
౧౧ (2) వర్ణలోపము లెటువలె
నంటే:—
చక్రవాకము - జక్కవ

పున్నాగము - పొన్న
కపోతము - గువ్వ
పారావతము - పారువము
కాననము - కాన
తామరసము - తామర
దేవాలయము - దేవళము
ఖలీనము - కళ్లెము
పలాలము - పొల్లు
పల్యయనము - పల్లానము
పటోలి - పొట్ల
ఆతపము - ఎండ
హింతాలము - ఈఁదు
ఉపగేహము - ఉప్పరిగె
కులాలము - గూడు
పరాగము - పొడి
కలకంఠి - కలికి
ఆర్జవము - ఆరజము
సోమయాజి - సోమాసి
వల్మీకము - పుట్ట
యావనాళము - జొన్న
నైపుణ్యము - నేర్పు
చాతుర్యము - చదురు
మురిమ్లుచశబ్దము - మ్రుచ్చు
కందళము - కందు
అంచలము - అంచు
విషమము - బేసి
సంతానము - సంతు
ప్రాచీనము - ప్రాఁచి

కుళుత్థము - కొల్లి
ఖరీరము - కాఁచు

౧౧ (7) మధ్యవర్ణలోపము.

కుక్కుటము - కోడి
వార్తాకము - వంగ
సంకేతము - సంత
కలహము - కయ్యము
కబళము - కడి
నియమము - నేమము
ధవళము - తెలి
పాండురము - బొల్లి
అమావాస్య - అమాస
పణ్యాహారము - పన్యారము
ఉపహారము - ఉపారము
పాయసము - పాసము
బిడారము - పిల్లి
కూబరము - గుడ్డము
కాషాయము - కావి
కరవీరము - గన్నేరు
చతుర్థి - చవితి
చతుష్కము - చౌకము
శాశ్వతము - సతము
కాహళి - కాళి
జీవితము - జీతము
ధమ్మిల్లము - తురుము
వృషభము - గిబ్బ
వధూటి - పెంటి

కుంభకారుఁడు - కుమ్మరి
స్వర్ణకారుఁడు - సొన్నారు
...మాత్రాధిక్యము -
చంద్రమశ్శబ్దము - చందమామ
లోధ్రశబ్దము - లొద్దుగు
దంభశబ్దము - దబ్బర
దేవశబ్దము - దేవర
వేణీశబ్దము - వేనలి
పశ్చిమము - పడమర
శూర్పనఖ - చుప్పనాతి - చుప్పనాక
ఝరసి - చేతరాసి
పణము - పన్నిదము
...వర్ణైకగ్రహణములు.
రాత్రిశబ్దము - రే, రే రేడు
రాజన్‌శబ్దము - రా, రా రాజు
పుష్పశబ్దము - పూ, పూబోడి
వ్రజశబ్దము - వ్రే, వ్రేపల్లె
తుంతశబ్దము - తుమ్మ
అస్త్రము - అమ్ము
గ్రామము - గాము
ముఖము - మోము
వృషభము - గిబ్బ
...రూపభేదములు:—
కర్పూరము - కపురము
గంబురము - గంబూర
గంబుర - గంబూరము, గంబురా

అద్భుతము - అబ్బురము, అబ్రము
సంతోషము - సంతసము, సంతోసము
పర్వము - పరువము, పబ్బము-పండువ
త్యాగము - చాగము, తెగువ
కార్యము - కారియము, కర్జము
మర్యాద - మరియాద, మేర
ఆర్యుఁడు - అయ్య, అజ్జ
సత్యము - సత్తెము, సత్తు
ముక్తాశబ్దము - ముత్తియము, ముత్తెము, ముత్యము
అమావాస్య - అమవస, అమాస
పుష్పము - పూ, పూవు, పువ్వు, పువు
ద్వీపము - దీవి, దీబ
విద్య - విద్దె, విజ్జ
శయ్య - సజ్జ, సెజ్జ
ఈర్ష్య - ఈరసము, ఈసు
అగ్ని - అగ్గి, అగని
వక్రము - వంక, వంకర
మృగము - మెకము, మెగము
ముఖము - మొకము, మొగము, మోము
కాలము - కారు, కరి

గ్రామము - గవము, గాము
వీటికాశబ్దము వీడెము - విడియము
వీడ్యము - వీడెము
స్థూలము - తోరము, దొడ్డు
పీఠము - పీట, పీఠి, పిడి
వృద్ధశబ్దము వృద్ధు, పెద్ద
గృధ్రము - గెద్ద, గ్రద్ద
గృహము - గివము, గీము
అంబ - అమ్మ, అవ్వ
స్థలము - తావు, చోటు
ఏకశబ్దము - ఒక, ఒక్క,
ఒక్కఁడు, ఒకఁ, ఒక్కొఁడు
ముకుళము - మొగడ, మొగ్గ
శిరీషము - సిరిసము, దిరిసెన
గుచ్ఛము - గుత్తి, కుచ్చు, కుంచ
పేటి - పెట్టె, పేడె
దృఢము - దిటము, దిట్టము, దిట్ట
చేష్ట - చిట్టకము
చైత్యము - చైది
కరము - కై, కయి, కేలు
కుధ్రము - కొండ, గట్టు
ప్రౌఢ - ప్రోఢ, ప్రోడ
బీజము - గింజ
హృదయము - ఎద, డెందము
ఉష్ణము - వెట్ట, వెచ్చము
శ్యామ - చామ, చాన

ఇది శ్రీమదశేషమనీషిహృదయంగమ మృదుపదనీరంధ్ర శుద్ధాంధ్రరామాయణ ఘటనావైదగ్ధీధురంధరాడిదము బాల భాస్కరకవి తనూభవ సరసకవితావైభవసౌజన్యనిధాన సూర యాభిధానప్రణీతంబైన కవిసంశయవిచ్ఛేదన మను లక్షణము నందు సర్వంబును తృతీయతరంగము సంపూర్ణము.

కవిసంశయవిచ్ఛేదము సంపూర్ణము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—22-4-1955.

# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అడవిమల్లెలు | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము | ... | 2 | 0 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | ... | 1 | 0 |
| అప్పకవీయము, క్రొత్తకూర్పు | ... | 5 | 0 |
| అప్పకవీయవిమర్శ, శ్రీగిడుగు రామమూర్తిగారిది | ... | 0 | 12 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 8 |
| ఆముక్తమాల్యద. (విష్ణుచిత్తీయము), సటీక | ... | 8 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక | ... | 0 | 12 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు | ... | 15 | 0 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| ,, టీక, పాతప్రతి | ... | 8 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతి సప్తకము | ... | 7 | 8 |
| ఆది సభాపర్వములు గలసంపుటము | ... | 4 | 0 |
| అరణ్యపర్వము | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 4 | 0 |
| శాంతిపర్వము | ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 4 | 0 |
| ఆనందరంగరాట్ఛందము | ... | 1 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | | 1 | 8 |

| | | ప్రతి 1-కి రుపా. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రనామసంగ్రహము, పద్యకావ్యము, మూలము | ... | 0 | 4 |
| డిటో సటీక | ... | 0 | 10 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు కాలికో | ... | 2 | 0 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు | ... | 15 | 0 |
| 7 సంపుటములు | ... | 18 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 1 | 8 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు | ... | 15 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 1 | 4 |
| ఉత్తరరామాయణము చక్కనితూర్పు | ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము | ... | 3 | 0 |
| కవికంఠోక్తి | ... | 0 | 4 |
| కవిజనాశ్రయము | .. | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి | .. | 0 | 12 |
| కవిరాజమనోరంజనము | | 1 | 4 |
| కవిజనరంజనము | | 0 | 12 |
| కృష్ణదండకము | | 0 | 2 |
| కవిగజాంకుశము | ... | 0 | 4 |
| బేరీజాపద్యములు | ... | 0 | 4 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 12 |
| కాశీఖండము | ... | 3 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక (భాగవతము) | ... | 0 | 8 |
| డిటో గట్టుప్రభువుకృతము | ... | 0 | 12 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము | ... | 5 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1

# ఆంధ్రవ్యాకరణములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆనందరంగరాట్ఛందము ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, కవ్య[illegible]యము ... | 0 | 6 |
| కవిజనసంజీవని ... | 0 | 8 |
| సులక్షణసారము ... | 1 | 5 |
| లఘువ్యాకరణము ... | 1 | 0 |
| ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము ... | 1 | 0 |
| పట్టాభిరామపండితీయము, (పద్యవ్యాకరణము) ... | 0 | 8 |
| రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి తెలుగు వ్యాకరణము (ప్రాచీనము) | 1 | 8 |
| ప్రౌఢవ్యాకరణము ... | 1 | 8 |
| ,, సటీక బులుసు వేంకటరమణయ్యగారిది ... | 3 | [illegible] |
| వెంకయ్యవ్యాకరణము ... | 0 | 6 |
| వ్యాకరణసంగ్రహము ... | 0 | 8 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక ... | 0 | 12 |
| ఆంధ్రశబ్దమంజరి బ॥ సీతారామాచార్యులు ... | 0 | 12 |
| బాలచంద్రోదయము, అలఘుకౌముది ,, ... | 0 | 9 |
| బాలవ్యాకరణము, శ్రీ చిన్నయసూరి గారిది ... | 1 | [illegible] |
| ,, శ్రీ దూశి రామమూర్తిగారి టీకతో ... | 6 | 0 |
| ,, బులుసు వేంకటరమణయ్యగారి లఘుటీకతో | 2 | [illegible] |
| విభక్తిచంద్రిక ... | 0 | 6 |
| ఆంధ్రసంస్కృతవ్యాకరణము, ప్రథమశిక్షాత్మకము, వేదము సూర్యనారాయణశాస్త్రిగారిది ... | 1 | 4 |

ఇవిగాక అనేక సంస్కృతాంధ్రగ్రంథములు నాగరిలిపి గ్రంథములు, అరవగ్రంథములు మావద్ద దొరకును.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
పోస్టుబాక్సు 1872, చెన్నపురి. 1.